

తప్పక చూడండి!

శ్రీ విఠల్ కంబైన్స్ వారి

# అగ్గిదొర

రచన: జి. కృష్ణమూర్తి, పాటలు: సి. నారాయణ రెడ్డి, కొసరాజు, జి.కె. మూర్తి

సంగీతం: విజయా కృష్ణమూర్తి, కెమేరా: వేణు, నృత్యం: చిన్ని-సంపత్, కళ: బి. నాగరాజన్

దర్శకత్వం: బి.వి. శ్రీనివాస్ పర్యవేక్షణ: జి. విశ్వనాథం

నిర్వహణ: బి. విఠలాచార్య

పూర్ణా రిలీజ్

RAVIRANG

# జీవన్ టోన్

గవర్నమెంటు రిజిస్టర్డు ... 18726 Phone No. 440206



మందు తీసుకొనక ముందు



20 దినములు తీసికొన్న తర్వాత



40 దినములు తీసికొన్న తర్వాత



60 దినములు తీసికొన్న తర్వాత

పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి ఫలితాలను పొందనివారు అనేకులున్నారు. కాని జీవన్ టోన్‌ను కొనుక్కొని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్ టోన్ కేవలం వనస్పతి కొవ్వునుంచి తయారుచేయబడినది. జంతువులకొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్టతకు కారణం అని కొందరు అనుకోవటం పొరపాటు.

**జీవన్ టోన్ గుణములు:** ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకలపోగువలె, బలహీనంగా ఉండేవారు కొంతమందిఉన్నారు. అట్టివారికి జీవన్ టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తి నిస్తుంది. ఇది బలహీనత, కాళ్లుచేతులు తేలిపోవుట, తలతిరుగుడు, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపుఛాయ పొందటానికి జీవన్ టోన్‌తో టొమాటోలు తీసుకొనండి. ఆరోగ్యవంతులకు కూడ జీవన్ టోన్ మంచిది. జీవన్ టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం అవసరం. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్టత చేరిన వెంటనే జీవన్ టోన్ సేవించడం నిలపడం మంచిది. స్థూలకాయులు జీవన్ టోన్ తీసుకొనుట మంచిదికాదు. అట్టివారు జీవన్ టోన్ తీసుకుంటే మేము బాధ్యులం కాము. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకొనకూడదు. ఇతర వివరాలు మందుతో పంపబడతాయి వెల: 454 గ్రాములు రూ. 10/-. పోస్టు చార్జీలు అదనం.

**స్కిన్ లీమ్స్** యవ్వనసౌందర్యం కలిగియుండటం వరప్రసాదం. స్కిన్ లీమ్స్ మీ చర్మాన్ని, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, వివర్ణత, కోతలు, శోభినుంచి కాపాడుతుంది. స్కిన్ లీమ్స్ ముఖమందలి మడ్డి తొలగించిన తరువాత వాడవలయును. మీరు ఏ స్నోనుగాని, పౌడరునుగాని వాడవచ్చును. స్కిన్ లీమ్స్ ఒక కోర్సు రు. 12/-

**JOTHI HOSPITAL,** POST BOX No 1413 32, VENKATANARAYANA ROAD. MADRAS-17.

స్థానిక డాక్టరు: డాక్టర్ దామోదరం, M A IAD.S

# ఉచితం

ఒక కూపన్,
దీనివల్ల మీకు
**35 పైసలు**
సింథాల్ టాయిలెట్
పౌడర్ ధరలో
మిగులును.







ప్రతి సింథాల్–శరీర దుర్గంధమును తొలిగించి, సౌందర్యమును
కలిగించే సబ్బు–యొక్క (రేపర్) కాగితపు పైమూత
లోభాగమున గల ఒక ప్రత్యేక కూపన్ సింథాల్ టాయిలెట్
పౌడర్ ఏ డబ్బీ ధరలోనైనా (పెద్దది, కుటుంబ సైజు లేక పొడు
పైన బాల పెద్ద సైజు) మీకు 35 పైసలను మిగుల్చును.
సౌమ్యమైన సువాసన గల సింథాల్ సబ్బులో మరియు టాయిలెట్
పౌడర్‌లో ప్రత్యేక సౌందర్యకారియైన పదార్థం జి–11
(హెక్సాక్లోరోఫీన్) గలదు.

సింథాల్ సబ్బు చాలాకాలము వాడుకకు వచ్చును మరియు
తక్కువ ఖర్చు.

రూఢిగా రెట్టింపు నమ్మికతో రోజల్లా హాయిగాను
పరిశుభ్రంగా నుండుటకు వాడండి–
సింథాల్ టాయిలెట్ పౌడర్
మరియు 35 పైసలను మిగుల్చుకోండి.

INTERPUB/GC 7 ...

## పాఠకులకు కృతజ్ఞత

ఇన్నాళ్ళూ [illegible] నా నవల చదివి తమ అమూల్యమైన అభిప్రాయాలను నిర్మొహమాటంగా వ్రాసిన పాఠకులకు నా కృతజ్ఞత. ఈ ఉత్తరాల్లో నవలా [illegible] (content) [illegible] ఉదాహరణకు [illegible] కాలేజీ [illegible] విమర్శ, నవలా రచనా [illegible] (accuracy) [illegible] పాత్రల ఔచిత్యాన్ని కథా గమనాన్ని [illegible] పరిశీలించి విమర్శించారు.

ఈ నవలయొక్క పాత్రల చిత్రణలో నేను అవలంబించిన ప్రక్రియ నాటకీయమైన ప్రతిస్పందన

# ఉత్తరాలు

పద్ధతి అంటే పాత్రల యొక్క మాటలనుబట్టి చేష్టలనుబట్టి ఒకపాత్రపై మరోపాత్రచేసే వ్యాఖ్యానాలనుబట్టీ ఆయా పాత్రల మనస్తత్వాన్ని పాఠకులు నిర్ణయించుకోవాలి. అందువల్ల కొందరు ఊలాటిదని కానీ, మధు మనస్సు ఊలాటిదనికానీ నేనుస్వయంగా ఎక్కడా వ్రాయలేదు. నా పాత్రలు నడిపించినట్లు నేను నడిచానుకానీ నా పాత్రలు నేను నిర్ణయించినట్లు నిర్ణీతమార్గంలో తిరగలేదు. ఇది నా అనుభూతి. అందువలననే నేను అడివి బాపిరాజుగారు

(64 వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 27—10—'67
ప్లవంగనామ సం॥ ఆశ్వయుజ మాసం బ॥ చవితి
సంపుటము : 60 సంచిక . 8

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
4, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |




## విషయానుక్రమణిక


మైసూరు మద్యనిషేధాన్ని ఎత్తివేసింది. త్రాగుడుని అరికట్టలేం అంటారు గునవడన్నై ఆంధ్రప్రదేశ్ కి అశక్యంగా ఉంది


నందా ఔషధంలో నీళ్ళ కల్తీ


ఉత్తరప్రదేశ్‌లో చాలా మంత్రి పదవులు ఖాళీగాఉన్నాయి. ఇతర పార్టీల్లో అసంతృప్తి పరులకు మంచి అవకాశం!
చరణ్ సింగ్




కొత్త గుఱ్ఱం దారికి రావటం కష్టం
దౌత్య వ్యవహారాలు

# రామలీలా ఉత్సవంలో రాజకీయాలు

రామ్‌సే మక్ డొనాల్డ్ గాలివాటు మనిషి. నీతినియమాలు లేనివాడు లాన్స్‌బరీకి నీతినియమాలున్నాయిగాని లోకజ్ఞానం శూన్యం' అంటూ లార్డ్ అట్లీ మరణాన్ని గురించి రాస్తూ ఒక వార్తాపత్రిక క్రోడీకరించింది. భారతదేశంలో మరో తెగ మనుష్యులున్నారు. వీరికి లోకజ్ఞానమూ ఉండదు, నీతినియమాలూ వుండవు!

కాంగ్రెస్ లోపలా బయటా రామ్‌సే మక్ డొనాల్డ్ జాతికి చెందినవారు కోకొల్లలుగా వున్నారు. అలానే ప్రజల్లో కూడా నీతి నియమాలు, లోకజ్ఞానమూ లేనివాళ్ళు బోల్డంతమంది ఉన్నారు లోకజ్ఞానం లేకుండా నియమాలున్న వాళ్ళని కనుక్కోవడం అంత కష్టం కాదు. ఉదాహరణకి కేంద్ర మంత్రివర్గాన్ని తీసుకుంటే అందులోనే కొందరున్నారు

ఢిల్లీ సాధారణంగా మందకొడిగావుండదు. ఎప్పుడూ ఏదో ఒక సంరంభంలో మునిగి తేలుతూనేవుంటుంది గాంధీజయంతి ఉత్సవంతో వారం ఆరంభమయింది ప్రస్తుతం ఢిల్లీలో 'రామలీలా' మహోత్సవం జరుగుతున్నది. బెంగాలీబాబులకి దుర్గాపూజా సెలవుదినాలున్న రోజుల్లోనే ఈ ఉత్సవం చోటు చేసుకుంటుంది. ఆ కుటుంబ కాలానికి [illegible] ధించిన పార్లమెంటు సమావేశానికి కొంచెం అటూ ఇటూ రామలీలా ఏర్పాటవుతుంది. రామ్‌మనోహర్ లోహియా మార్క్సు సోషలిస్టులకి, 'ఎ. బి. సి.' గ్రూపుకి ఇప్పుడు రాజ్యసభ అంతగా భయపడాల్సిన పనిలేదు. అందుకు లోహియాగార్కి కృతజ్ఞతలు చెప్పుకోవాలి! ఎ బి. సి గ్రూపుని నిర్వచించడం అవసరం. 'ఎ' అంటే ఆరోరాగారు. 'బి' అంటే భార్గవగారు. 'సి' అంటే చంద్రశేఖర్‌గారు. ఈ మూడు గ్రహాలు ఒకే స్థానంలో వున్నాయి. ఇందులో రాహువు ఎవరు? కేతు వెవరు? శని ఎవరు? అనేది పాఠకులకు ఊహాతీతం ఏమీకాదు. భారతవాసులు విదేశాలకి వెళ్ళి ఎలాగైతే మంతనాలు జరుపుతూ వస్తున్నారో, అలానే విదేశీయులూ మనవారితో మంతనాలు జరపడానికి వస్తున్నారు. వెళ్తున్నారు. అసలు ఇందులో మరో చిదంబర రహస్యం వుంది ఫలానావారితో మనకు పొసగదు అనుకుంటే వాళ్ళ నెప్పుడూ పిలవరు తమతమ భావాలతో ఏకీభవించేవాళ్ళని మాత్రమే ఆహ్వానిస్తూవుంటారు!

సాంప్రదాయమైన వేడుకల్ని అనుభవించడానికి శాస్త్రీయమైన పండుగల్ని జరుపుకోడానికి, 'ప్రాచీన సంస్కృతిని' ఒక్కసారి నెమరు వేసుకోడానికీ, తగిన సందర్భాలు జనవరి నెలలో మనకి కావలసినన్ని. గాంధీజయంతి ఉత్సవం ఎంతో నిరాడంబరంగా జరుపుకోవాలి ఈ ఉత్సవాలు అంతకంతకు కర్మకాండగా తయారవుతున్నవి రాష్ట్రపతిగారు ఉదయ ప్రార్థనలకి హాజరయ్యారు. ఎడతెగని నూలు వడికారు! దేశమంతా మరోసారి శాంతి సత్యాలమీద ఒట్టు వేసుకుంది శాంతిభద్రతలు కొరవడిన వాతావరణంలో ఈ తతంగమంతా వట్టి బూటకమని తేలిపోయింది!

ఈసారి రామలీలా ఉత్సవాన్ని జరిపేవారికి ఒక తక్షణసమస్య ఏర్పడింది రాష్ట్రపతి ముసల్మాను. ఆయన ఈ ఉత్సవంలో తిలకానికి అర్హుడు కాదు. ఇది భారతదేశంలో మొట్టమొదటిసారిగా తలెత్తిన సంఘటన ప్రధాన మంత్రి విదేశపర్యటనలో ఉన్నారు అందుకని ఉత్సవసందర్భంగా సీతా రామ లక్ష్మణులపేరిట ముగ్గురు బ్రాహ్మణ బాలుర్ని పూజించడానికి ఆమెకి అవకాశం లేదు. రామ్‌లీలా నిర్వాహకులు కొంచెం వెనక్కివచ్చి సర్వవేళలా సిద్ధంగా వుండే వారిని ఆశ్రయించవలసివచ్చింది. ఉపరాష్ట్రపతి, ఉపప్రధాని, దేశీయాంగమంత్రి మాత్రమే వారిదృష్టిలో కనబడుతున్నారు. వీరిలో ముఖ్యుల్ని ఎన్నుకుంటారన్నమాట. ఢిల్లీలో విదేశీ దౌత్యాధికారులు హిందూ సాంప్రదాయంలో ఒక భాగమైపోయారు. ఇటువంటివారికోసం రామలీలా మైదానంలో ప్రత్యేకమైన సదుపాయాలు ఏర్పాటు చేస్తుంటారు!

మొఘలు పరిపాలనా కాలంలోనే వుండాలని ఢిల్లీ అభిలషిస్తూ వుంది. మొఘలుల కాలంలో 'పూల పండుగ' ఒకటి జరుగుతూ వుండేది. దానిని బహదూర్‌షా ప్రారంభించారని చాలమంది అమాయకులు అనుకుంటూ వుంటారు. కాని దానిని మహమ్మద్ షా మొదలుపెట్టారు. మొట్టమొదటి వర్షపు మేఘాలు ఆకాశం మీద కనిపించగానే మొఘలుల పరివారమంతా మెహ్రౌలీకి తరలి వెళ్ళేది వర్షాకాలమంతా కుతుబ్ మీనార్‌కి సమీపంలో వున్న ఆ చోట గడిపేస్తూ వుండేవారు ఇది అప్పటి గాథ బ్రిటిష్‌వారి కాలంలో కూడా ఈ వలస పోవడాలున్నాయి గాని అవి కేవలం రెండురోజులకు మాత్రమే పరిమితమై వుండేవి. ఢిల్లీలో జీవితం విసుగెత్తి వారం రోజులు దాకా మెహ్రౌలీలో వుండి విశ్రాంతి తీసుకుంటుండేవారు! తాగడం, తందనాలాడడం అప్పటి ఆచారంలో ఒక భాగం. ఢిల్లీ కలెక్టర్ని ఆహ్వానించి విందులో పాల్గొనేట్టు చేస్తుండేవారు ఇది అధికారుల హోదాతో ముడివేయకుండా సాఫీగా జరిగిపోతూ వుండేది.

మన కాంగ్రెసు నియమాలు ఈఉత్సవాన్ని రాజకీయంగా మార్చేశాయి. హోదాని పులుముకోవాలి అనుకునేవాళ్ళు ఈ వుత్సవాన్ని ఏర్పాటు చేస్తున్నారు. రాష్ట్రపతితోనో, ఉపరాష్ట్రపతితోనో, ప్రధాన మంత్రితోనో కలిసి తిరగాలని, ఫొటోలు తీయించుకోవాలని వారి సరదా. బ్రిటిషువారి కాలంలో తాహసిల్దారుకి కూడా ఎందులోనన్నా పాల్గొనాలంటే తీరిక ఉండేదికాదు. ఇప్పుడు మన రాష్ట్రపతికి, ఉపరాష్ట్రపతికి అసలు పని అంటూ వుండదు గనక ఏ చిన్న కార్యక్రమానికయినా హాజరవుతుంటున్నారు. రాజకీయపక్షాలు ఇటువంటి వాటికి వ్యక్తికి వ్యక్తికి మధ్యని పరస్పర అవగాహన అని పేరు పెడుతున్నారు. తక్కినవాళ్ళు

ష్టదంతా ఒక తంతు అంటున్నారు.

**భారతదేశమా? ఇండొనీషియా?**

శ్రీమతి గాంధీగారికి అతి సన్నిహితుడుగా, లాభదాయకుడూ అయిన శ్రీ రమేష్‌థాపర్ బెంగాలు గురించిన కథని ఇలా చెప్పారు:

'కామరాజుగారి మెణుకు మెణుకు మనే తెలివితేటలవల్ల—కాంగ్రెసును పునరుద్ధరించాలని కంకణం కట్టుకున్న నందా, పాటిల్, అతుల్యఘోష్‌గారలు చాటుకు వెళ్ళిపోయారు. ప్రజల్లో పరపతిని పోగొట్టుకున్నవారు, ఎన్నికల్లో ఓడిపోయినవారు, అధ్యక్షుని 'బండి'లో కూర్చుని కోరికలు తీర్చుకుందామని ఉవ్విళ్ళూరడం ఎంతవరకు ముదావహం?

ఇందిరాగాంధిగారికి ఇప్పు డొక పెద్ద సమస్య ఎదురయింది తోటివాళ్ళని, ఎన్నికల్లో ఓడిపోయిన పెద్దవాళ్ళని తప్పుకుని యువతరానికి స్థానమివ్వాలని ఆమె చెప్పవలసివుంది. యువతరం, పార్టీని పటిష్టం చేస్తారని ఆమె చెప్పగలగాలి. పార్టీ పునర్వ్యవస్థీకరింపబడకుండా, దేశం పరిస్థితిని అవగాహన చేసికోకుండా ముందుకు వెళ్ళినట్టయితే మన అభ్యుదయం సంగతి చెప్పనక్కరలేదు. అసంగతమైన రయిటిస్టుల మధ్య, లెఫ్టిస్టుల మధ్య తీవ్రమైన ప్రతికూల వైఖరి కనిపిస్తున్నది. మొత్తం రాజకీయపద్ధతికే అది గొడ్డలిపెట్టు కాగల సూచనలు కనిపిస్తున్నాయి.'

1962 లో శ్రీమతి గాంధీ సిటిజన్స్ కవున్సిల్‌కి 'ఛెయిర్‌వుమన్' అయినప్పటినుంచి ఆమె ఇదే మంత్రాన్ని పఠిస్తూవున్నారు. ఆమె మంత్రివర్గంలో దేశాయ్ గారిని మినహాయించి, జగ్‌జీవన్‌రామ్, యశ్వంతరావ్ చవాన్, సర్దార్ స్వరణ్ సింగ్ గారలు అందర్నీ ఆమె స్వతహాగా ఎన్నిక చేసుకున్నవారే వీరందరూ హోదాను కోరుకునేవారే. రాజకీయ సాహసికులు కూడాను! శ్రీమతిగారి ప్రకాశవంతమైన నీలికళ్ళ యువకుడు దినేష్‌సింగ్‌గారే అమ్మోనియా ఎరువుల ప్రాజెక్టు విషయాన్ని కుంటి నడక నడిపించడానికి కారకులయ్యారు! భారతదేశం, సుకర్నో పాలించిన ఇండొనీషియాలా తయారయింది అందుకు శ్రీమతి గాంధీ చుట్టూవున్న యువకుల్ని మనం అభినందించాలి! ఈ యువకులికి పారిపాలనానుభవం లేదు. లోకజ్ఞానం సున్నా అందరూ ఒకే స్థాయికి చెందిన ఇష్టానిష్టగరిష్ఠులు! పెరిగిపోయిన ఛాతీలు విరుచుకుని తెలివైన రచయితలు రాసిచ్చిన ఉపన్యాసాల్ని చదువుతూ వుంటారు. ఉదాహరణకి తీసుకుంటే, మియ్యాఁ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ గారి నుంచి రెండు మాసాల లోపులో ఒక ఫైలును తిరిగి తీసుకోవడమనేది ఊహించరానివిషయం!

భాషని ప్రాంతీయం చేయడం ద్వారా జాతీయతను కాపాడాలని బాబు టి. సేన్‌గారు ఎలా నైతే అనుకుంటున్నారో, అలానే మియాఁ అలీ అహ్మద్‌గారు రాంచి ముస్లిం ఉద్యోగులకి ఒక ప్రత్యేకమైన 'పేట'ని

(13వ పేజీ చూడండి)













# మూన్ రేకర్-4. జేమ్స్‌బాండ్ కామిక్ సీరియల్




"మీ క్లబ్‌లో గొడవ మీ కిష్టం ఉండదు కాబట్టి నేనే సర్ హ్యూగో డ్రాక్స్‌కి పాఠం నేర్పుతాను, లార్డ్ బేసిల్డన్!"

"మీ రిద్దరూ ఆడే ఏర్పాట్లు చేస్తాను......"

(నేను పేక ముక్కలని ఏర్పాటు చేస్తాను.)

"భోజనం అయిన తర్వాత ఆడుదాము బాండ్!"




లార్డ్ బేసిల్డన్ ఆ రాత్రి నాకు బ్లేడ్స్‌లో భోజనము పెట్టించాడు.

భోజనం ముగిస్తూ ఉండగా సర్ హ్యూగో (డ్రాక్స్) వచ్చేశాడు.

"ఏమండీ, మేక పిల్లలు నరికేందుకు సిద్ధంగా ఉన్నాయా?"

("కసాయి వాడెవరు?")

నా 'ఏర్పాట్లు' సరిగా ఉన్నాయో లేదో తెలుసుకునేందుకు నా జేబులు తడుము కున్నాను.




సిగరెట్టు కేసు అద్దంగా వాడి సర్ హ్యూగో ముక్కలు కలిపినప్పుడల్లా గెలిచేవాడు.

వందలు వందలు గెలిచాడు. ఇక నేను మోసం [illegible]

ముందే పేర్చిన పేక పంచాను.










నా దొంగ పంపిణీ సర్ హ్యూగో డ్రాక్స్‌కి సంతోషము కలిగించింది— మొదట్లో.

కాని 'క్రాస్ ట్రంపింగ్', 'ఫైనెస్' అలో 'గ్రాండ్ స్లామ్' నాకు తప్పదు.....

ఆ ఆటలో డ్రాక్స్ 15,000 పవున్లు పోగొట్టుకున్నాడు......







మంచి 'ఆటగాడు'యిన సర్ హ్యూగో డ్రాక్స్— కోటీశ్వరుడు— సరదాగా వోడి పోయేరకం కాదు.

'మిస్టర్ బాండ్ నాదగ్గిర 15000 గెలిచావు నేనే నువ్వయితే డబ్బు తొందరగ ఖర్చు చేసే స్తాను''

(''సర్ హ్యూగో డ్రాక్స్‌లాంటివాడు నన్నెందుకు దడిపిస్తున్నట్టు?'')













మర్నాడు సీక్రెట సర్వీస్ హెడ్ క్వార్టర్స్‌కి వెళ్తున్నప్పుడు నాకు సంతోషం వేసింది ప్రపంచంలో కల్లా ధనవంతుడైన ఒకడికి పేకలో మోసం చేయటం మంచిది కాదని నేర్పాను.''

007ని ...
''డ్రాక్స్ ప్రాజెక్టు గురించి నిన్ను చూడాలంటున్నాడు.''

... హెచ్చరించావు బాగానే ఉంది. కాని రాకెట్ స్థావరంలో హత్య జరిగిందిప్పుడు''

**(ఇంకా ఉంది)**

# అజయ్ ముఖర్జీ ప్రహసనం

పశ్చిమ బెంగాల్ అధికార రాజకీయ ప్రహసనంలో నాయకుడు శ్రీ అజయ్ కుమార్ ముఖర్జీ కవళికలను పత్రికలు రకరకాలుగా అభివర్ణించుతున్నవి.

అక్టోబరు 7 వ తేదీ 'హిందూ' 'మిస్టర్ ముఖర్జీస్ వాల్టిఫేస్' అనే శీర్షికన ఇట్లా వ్యాఖ్యానించింది. 'ఈ రాజకీయ నాటకంలో ఎవరు నష్టపడినప్పటికీ మరెవరు ప్రయోజనపడినప్పటికీ ముఖ్యమంత్రి అజయ్ ముఖర్జీ బొమ్మ నల్లపడిపోయినదనే సంగతి స్పష్టమయినది.' యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం కొనసాగడం సాధ్యం కాదన్న నమ్మకం తనకు కలిగేటన్ని విభేదాలూ, ఒత్తిళ్ళూ మంత్రిమండలిలో పొటమరించిన వని శ్రీ ముఖర్జీ ఒప్పుకున్నారు. ప్రత్యామ్నాయ యేర్పాట్లు చేయక తప్పదని భావించారు. ఇన్ని చెప్పిన తరువాత కూడా రహస్య మంతనాలు జరిపారు. గతంలో అనేక ప్రమాదాలను సృష్టించిన మార్క్సిస్టుల పెత్తనంలోని యునైటెడ్‌ఫ్రంట్‌తో పొత్తు కొనసాగించడానికి నిశ్చయించానని ప్రకటించారు. కమ్యూనిస్టుల వాగ్దానాల సంగతిని ప్రస్తావించి అట్టి వాగ్దానాలు లేకపోయిన కారణంగానే గతంలో తన మార్క్సిస్టు మిత్రులు ఈ రాష్ట్రంలోని పరిశ్రమలలో ఆటవిక ధర్మాన్ని చలాయించారని ప్రజలకు శ్రీ ముఖర్జీ చెపుతున్నారా?' అని ఈ పత్రిక ప్రశ్నించినది.

పశ్చిమ బెంగాల్ యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వంలోనుంచి కమ్యూనిస్టులను తప్పించివేసే మహదవకాశాన్ని వెూటుగా కోల్పోవడం జరిగిందని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' వ్యాఖ్యానించింది. శ్రీ అజయ్ ముఖర్జీ తనను మోసం చేశారని శ్రీ నందా భావిస్తారంటూ 'లాస్ట్ ఆపర్ట్యునిటి' అనే శీర్షికన ఈ పత్రిక 'నమ్మడానికి వీలులేనంతటి బలహీనుడు శ్రీ అజయ్ ముఖర్జీ అన్న శ్రీ కామరాజ్ అభిప్రాయం మరింత ధృవపడుతుం'దన్నది. 'అట్లా జరుగుతుందని నేను చెప్పనే చెప్పాను' అంటారు శ్రీ అతుల్యఘోష్. ఘోరమయిన అన్యాయం తనకు జరిగినదనే భంగిమలో, ముందు ఇచ్చిన మాటను శ్రీ అజయ్ ముఖర్జీ నిలబెట్టుకొనలేకపోయినారని ఆరోపించే అవకాశమున్నప్పటికీ, ప్రభుత్వంనుంచి కమ్యూనిస్టులను తొలగించే ఈ యత్నం సాగిరాకపోయినందుకు కాంగ్రెస్ పార్టీని, ముఖ్యంగా కాంగ్రెస్ అధ్యక్షుణ్ణే నేప మెన్నక తప్పదు. శ్రీ నందా సిఫార్సు చేసినట్లు పశ్చిమ బెంగాల్ కాంగ్రెస్ సంఘాన్ని రద్దుచేసి తాత్కాలిక కార్య నిర్వహణ సంఘాన్ని వెంటనే నియమించివున్నట్లయితే యీ ఎత్తుగడ తప్పక పనిచేసివుండేదని ఈ పత్రిక అభిప్రాయపడినది

'పాచ్‌డ్ అప్' అనే శీర్షికన 'ది స్టేట్స్‌మన్' అక్టోబరు 7 న ఇలా వ్యాఖ్యానించింది. 'ఆధారాలేమిటో తెలియదుగానీ, తన మంత్రిమండలిలోని కొన్ని పక్షాల కార్యకలాపాలు పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ అజయ్‌ఘోష్‌కు ఇప్పుడు సంతృప్తి కలిగించినవి.' కానీ ప్రజలకు సంతృప్తి కలగాలంటే శ్రీఅజయ్‌ముఖర్జీ చేసిన ప్రకటనలోని అంశాలకంటే గట్టి పునాదులవసరమవుతవి ఏవేవో హామీలు తనకు లభించినవంటారు శ్రీ అజయ్. మరి గతంలో వారి వద్దనుంచి తనకు లభించిన హామీలకంటే ఇప్పటి హామీలు ఏవిధంగా భిన్నమయినవని అడగడం అసందర్భం కాదు. ఫ్రంట్ ప్రభుత్వంపట్ల ప్రజల నమ్మకం సడలినది. తిరిగి అట్టి నమ్మకం ప్రజలలో కుదురుకోవాలంటే యేవేవో సర్దుబాట్లు చేసుకున్నంతమాత్రాన ప్రయోజనంలేదు. విప్లవకరంగా కనిపించకపోయినప్పటికీ, తు. చ. తప్పని పద్ధతిన శాసనాల ప్రకారం పరిపాలన సాగిస్తున్నామనే నమ్మకం ప్రజలకు కలిగించడమవసరమని ఈ పత్రిక హితవు చెప్పినది.

## ఘెరావో కథ

ఘెరావో పద్ధతి చట్టవిరుద్ధమయినది. కార్మికుల కోరికలను తమ ప్రయోజనాలకు రాజకీయపక్షాలు ఉపయోగించుకునే ఎత్తుగడలను నిరోధించవలసిన బాధ్యత ప్రజాస్వామిక జీవిత విధానంలో నమ్మకం కలవారందరికీ ఉన్నదని 'నో రైట్ టు ఘెరావో' అనే శీర్షికన అక్టోబరు 2 వ తేదీన 'టైమ్స్ ఆఫ్ ఇండియా' హితవు చెప్పినది. ఘెరావోల సందర్భంగా పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం జారీ చేసిన కొన్ని ఉత్తరువులను రద్దు చేస్తూ కలకత్తా హైకోర్టు చెప్పిన తీర్పును ఈ పత్రిక ప్రశంసించినది. ఘెరావోల పర్యవసానంగా ఇబ్బంది పడేవారికి సహాయ మందజేయవద్దని పోలీస్‌లను ఆదేశించే అధికారం శాసనం ప్రకారం కార్మికశాఖ మంత్రికి లేదు. ఘెరావో ఆగడాలకు కలకత్తా ప్రధాన న్యాయస్థానం తీర్పు స్వస్తి చెప్పేదీ లేనిదీ ఆ రాష్ట్ర మంత్రిమండలిలోని కొందరు మంత్రుల వైఖరి మారడంమీద ఆధారపడివుంటుందని ఈ పత్రిక సంపాదకీయమంటున్నది.

జే ఇంజనీరింగ్ 'ఘెరావో' అభియోగంలో కలకత్తా హైకోర్టు చెప్పిన తీర్పు న్యాయదృష్టికీ, ధర్మదృష్టికీ ఒరవడివంటిదని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' అభివర్ణించినది. న్యాయ చట్టాలను ప్రయత్న పూర్వకంగా నిర్లక్ష్యం చేయడానికి పరిపాలకులు ఉద్యమించే సందర్భాలలో కూడా శాసన పరిపాలనను సముద్ధరించాలని న్యాయస్థానాలు కృతనిశ్చయమైనవని ఈ తీర్పు విశదం చేస్తున్నది. ఈ వ్యవహారంలో పోలీసులు వ్యవహరించిన తీరును ఈ తీర్పు తప్పు పడుతున్నది. శాసనాలను చెత్తకాగితాలుగా మార్చిచేసే ఉత్తరువులను పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఇకముందు జారీ చేయజాలదు. అట్టి ఉత్తరువుల నెపాన పోలీసులు తమ ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించకుండా చేతులు నలుపుకుంటూ కూర్చునే వీలుండదని ఈ సంపాదకీయం ఆశించుతున్నది.

అరాచకం, అయోమయం, అశాంతి, పరిశ్రమలలో ప్రతిష్టంభన తొంగి చూస్తున్న పశ్చిమ బెంగాల్ పరిశ్రమల పాలిట 'కాంతిరేఖ' కలకత్తా హైకోర్టు తీర్పు అని 'హిందూ' పత్రిక 'ఘెరావో అండ్ ది పోలీస్' అనే శీర్షికన అభివర్ణించినది. లోకాభిప్రాయాన్ని ఈ తీర్పు ధృవపరుస్తున్నది. పై అధికారులు మరోరకం ఆదేశాలిచ్చినప్పటికీ అఘాయిత్యాల పాలయ్యేవారికి తగు సహాయమందజేయడం పోలీసుల విధి అని ఈ తీర్పు స్పష్టంగా ఆదేశిస్తున్నదని ఈ పత్రిక సంపాదకీయం అంటున్నది.

—వి. ఎస్. అవధాని

# బిన్నీ అసలు సిల్కు చీరలో స్వప్న లోకాల్లో ఆనందం



చీరను ధరించి
ఆహ్లాదాన్ని, సౌఖ్యాన్ని, అపురూప
లావణ్యతను అనుభవించాలని కోరే
సుందరాంగులంతా బిన్నీ అసలు
సిల్కు చీరలో ఆ స్వప్నాన్ని కన్నుల
పండువ చేసికొంటారు.
ఎంతో ప్రకాశవంతంగాను, దేదీప్య
మానంగాను, విశిష్టంగాను వుండే
బిన్నీవారి అసలు సిల్కు చీర
మీ కల నిజం కావటమే.
బిన్నీ అసలు సిల్కు చీరలు
శుద్ధమైన జార్జెట్, సాఫ్ట్ సిల్కు,
షాట్ సిల్కు

bm-4268



డాక్టర్ రామ్‌మనోహర్ లోహియా.

కొంతకాలం క్రితం శ్రీ రామ్‌మనోహర్ లోహియా రాసిన 'రోజుకి ఇరవయి అయిదువేల రూపాయలు' అనే పుస్తకం వెలువడినప్పుడు ఒక వామపక్షపత్రిక సమీక్షకుడు 'ఈ సామర్థ్యాలని ఇంతకన్నా బాగా సద్వినియోగం చేసి ఉండవచ్చు' నని వాపోయాడు. ఈ పుస్తకంలో శ్రీ లోహియా జవహర్‌లాల్ నెహ్రూకోసం రోజుకి ఇరవయి అయిదువేల రూపాయలు కర్చు అవుతున్నట్లు కొన్ని సాక్ష్యాలు చూపారు. సాధారణంగా రష్యా విధానాలని సంపూర్ణంగా బలపరచని సోషలిష్టులని ప్రత్యేకంగా దూషించే కమ్యూనిస్టువర్గాలు కూడా రామ్‌మనోహర్ లోహియాని ఎప్పుడో తప్ప దూషించేవికావు. దీనికి కారణాలు ఎన్నో చెప్పవచ్చు కాని వాటన్నిటిలోనూ ముఖ్యమయినది శ్రీ లోహియా నిజాయితీ పట్ల అందరికీ ఉన్న గౌరవమేననటంలో అతిశయోక్తిలేదు. రామ్‌మనోహర్‌లోహియా భారతదేశం మేధావులలో కొంత అపురూపమయినవ్యక్తి. ఏ విషయంలోనూ ఇతరులు ఏమనుకుంటారోనని తల ఊపటం ఆయనకి అసలు అలవాటులేదు. బహుశ, అధికారానికి తల వంచటం ఆయన స్వభావానికే విరుద్ధం అయి ఉండవచ్చు.

రామ్‌మనోహర్ లోహియా ఉత్తరప్రదేశ్‌లోని ఫరుకాబాద్‌జిల్లాలోని కబర్‌పూర్‌లో 23-3-1910లో జన్మించారు తండ్రి శ్రీ హీరాలాల్ లోహియా గాంధిగారి అనుచరులలో ఒకరు శ్రీ రామ్‌మనోహర్ లోహియా విద్యాభ్యాసం బొంబాయి, కాశీ, కలకత్తాలలో జరిగింది. ఆయన కలకత్తా విశ్వవిద్యాలయంలో బి ఏ. డిగ్రీ పుచ్చుకున్నారు ఆ తర్వాత ఆయనని లండన్‌కి పంపించారు కాని సామ్రాజ్యవాదుల దేశంలో చదువుకొనటానికి ఇష్టపడక శ్రీ లోహియా జర్మనీకి వెళ్ళిపోయారు అప్పటి కాలంలోనే ఆయనకి కమ్యూనిస్టువర్గాల నియంతృత్వ ధోరణులు నచ్చలేదు మరీ వారి అధికారం కింద ఉందని ఒక విద్యార్థి సంఘాన్ని వదిలి తామే ఒకదానిని స్థాపించారు, ఇంతలో హిట్లర్ అధికారానికి రావటంతో శ్రీ లోహియా ప్రొఫెసర్ ... యని భారతదేశానికి ... చేశారు ... శిష్యుడికోసం పి హెచ్ డి పరీక్ష ... ముందుగా కూడా ...ట్టారు

స్వదేశానికిరాగానే ఆయన రాజకీయాలలోకి దిగారు సత్యాగ్రహించే కారాగృహానికి వెళ్ళారు అక్కడినుంచి తప్పించుకున్నారు కూడా!

స్వాతంత్ర్యానంతరం కూడా రామ్‌మనోహర్ లోహియా కారాగృహవాసం తప్పలేదు పేదజనంకోసం ఆయన ఎన్నో ఉద్యమాలలో పాల్గొన్నారు దేశంలో 20 కోట్లమందికి పమినరోజుకి మూడు అణాలమీద బతుకుతున్నారని ఆయన పార్లమెంటులోచేసిన ప్రకటన చరిత్రాత్మకమయినది.

అమెరికా ఎంతో రష్యాకూడా అంత భారతదేశం శత్రువు అనేవారు డాక్టర్ లోహియా. ఇటువంటి సిద్ధాంతాలని సంపూర్ణమయిన నిజాయితీ, ధైర్యం కలవారే ప్రతిపాదించగలరు. అందుకనే అక్టోబర్ 12వ తేదీన డాక్టర్ రామ్‌మనోహర్ లోహియా కొత్త ఢిల్లీలో చనిపోయినప్పుడు అన్నివర్గాలవారు భారతదేశప్రజలు ఒక గొప్ప మిత్రుడినీ, శ్రేయోభిలాషినీ పోగొట్టుకున్నామనుకున్నారు.

—ఆర్.

# న్యూఢిల్లీ లేఖ

(7 వ పేజీ తరువాయి)

ఏర్పాటు చేయడానికి వాగ్దానం చేశారు. మహమ్మదాలీ జిన్నాగారు ప్రతి భారత గ్రామంలోను ఒక పాకిస్తానుని ఏర్పాటు చేయాలని కాంక్షించారు. ఆ ఆకాంక్షని ఫక్రుద్దీన్‌గారు నెరవేరుస్తున్నారు.

ఇటువంటి దుష్చర్యలే భారతదేశంలో అనవ్యస్తమైన పరిస్థితికి, ఆర్థికదుస్థితికి కారణమైనాయి దేశాన్ని వెనక్కినెట్టి, కమ్యూనిస్టులు తలెత్తుకునేలా చేశాయి

**'ఛోటారాజా'-'రిక్షావాలాల' మధ్య టి. టి. కృష్ణమాచారి!**

భారత ప్రజలందరూ నా వైపున ఉన్నారని శ్రీమతి గాంధీ అంటున్నారు అటువంటప్పుడు శ్రీమతి గాంధీగాని, వారి అనుచరులుగాని, ఆమెగా గును కోరేవారు ఎవరైనా గాని ఈ 'అపహారుల్ని' ఎందుకు కాంగ్రెసు నుండి తరిమివేయడం లేదు? ఇటువంటి అపహార్తల్ని ఇదివరలో కౌజిస్లోవర్ నుంచి తరిమివేశారు అలాగే ఇప్పుడు కాంగ్రెసు నుంచి వెళ్ళగొట్టొచ్చుగా? టి టి కృష్ణమాచారిగారు శ్రీమతి గాంధీగారితో కలియడాన్ని ఇక్కడ చెప్పుకోవాలి దినేష్ సింగ్‌గారిని 'ఛోటారాజా' అనడం కామరాజుగారికి అలవాటు అందరూ అలానే పిలుస్తున్నారు దినేష్‌సింగ్‌గారు కామరాజుగార్ని 'రిక్షాలాగేవాడ'ని పిలుస్తున్నారు! ఆది కామరాజుగారికి తెలిసిపోయింది. దినేష్ సింగ్ గారి పరమ స్నేహితులే ఆయనకది చేరవేశారు. కామరాజుగారిలో శాంతియుత పరిష్కారం కోసం దినేష్‌సింగ్‌గారు టి టి కృష్ణమాచారిగారిని సందర్శించారు! ఇక్కడ ఒక ప్రశ్న వేయబడుతోంది కామరాజుగారు అంతగా హీనుడయినప్పుడు మళ్ళీ ఆయనకీ తనకీ మధ్య రాయబారులెందుకు కావలసి వచ్చారు?

జీవితంలో అసహ్యమైన నిజం ఒకటుంది. అది, కామరాజుగారు శ్రీమతి గాంధీని భారతదేశానికి ప్రధాన మంత్రిని చేశారు అన్న నిజం మొరార్జీ దేశాయ్ ఓడిపోడానికి ఆయనే కారణం 'సిడమంత్రవు' వాళ్ళప్పుడు గొప్పవాళ్ళని అర్థం చేసుకోలేరు ఏ నిచ్చెన మీదనుంచి అయితే పైకి ఎగబాకారో, దానినే కాలితో తన్నగల అవివేకం లటువంటి కృతఘ్నులకు మాత్రమే వుంటుంది!

విలియం మాంచెస్టర్

# అధ్యక్షుని మరణం

## 20

జోసెఫ్ కెన్నెడీ జబ్బు మనిషి. అఫాసియా వ్యాధి వల్ల దేహమేకాక మనస్సు కూడా సరిగ్గా పనిచెయ్యదు. ఈ వ్యాధి వచ్చిన వారి ఆలోచనలు ఎలా ఉంటాయో చెప్పటం కష్టం. కాని, అంత జబ్బులోనూ జోసెఫ్ కెన్నెడీ ఏదో దారుణం జరిగిందని పసికట్టాడు కొడుకు టెడ్ కెన్నెడీ తను ఏదో ఉపన్యాసం కోసం మెసాచుసెట్స్ వెళ్లినట్లు చెప్పాడు- నిజానికి చర్చిలో 'మాస్'కి వెళ్లాడు టెలివిషన్ సెట్లు వయర్లు పీకివేశారు. పొద్దున వార్తా పత్రికలు లేకుండా చేశారు ఏవేవో సాకులు చెప్పారు. ఇంతలో కిటికీలో నుంచి నల్ల బట్టలతో ఇంట్లోకి వస్తున్న భార్యని చూశాడు జో. బాధతో గుంజుకున్నాడు. ఇక కొడుకు మరణ వార్త దాచి లాభం లేదని గ్రహించారు చిన్నవారంతా. పొద్దున వ్యాయామం అయిన తర్వాత పడుకుని ఉన్న తమ తండ్రి మంచం ఇరుపయిపులా కూర్చున్నారు టెడ్ కెన్నెడీ, యూనిస్ శ్రీవర్లు నెమ్మదిగా తను చర్చికి వెళ్లిన సంగతి చెప్పాడు టెడ్. జో కెన్నెడీ విభ్రాంతంగా కిటికీలో నుంచి కనిపిస్తున్న సముద్రం కేసి చూస్తూ ఉండిపోయాడు అఫాసియా రోగం ఉన్నవారి బుద్ధి ఒకొక్కసారి పని చేస్తుంది, ఒకొక్కసారి పని చెయ్యదు. వారి ఆలోచనల్లో వారు మునిగి ఉంటారు.

'ప్రమాదం జరిగింది,' అన్నాడు టెడ్ కెన్నెడీ అధ్యక్షుడికి పెద్ద దెబ్బ తగిలింది'

జో కెన్నెడీ ఉలిక్కి పడ్డాడు కొడుకు కళ్లలోకి తేరిపార చూశాడు. అతను చెప్తున్న ప్రతి మాటా వింటున్నాడు.

'అసలు అతను పోయాడు,' అన్నాడు టెడ్.

అధ్యక్షుడి తండ్రి ఏడవలేదంటారు కొందరు. ఇది సరికాదు. జో కెన్నెడీకి ఆవేశం ఎక్కువ. కొడుకంటే ఎంతో ప్రేమ ... పెద్ద కొడుకు యుద్ధంలో మరణించినప్పుడు ఆరోగ్యంగానే ఉన్నాడు. కాని అప్పుడు ఏడ్చాడు; ఇప్పుడు మళ్లీ ఏడ్చాడు. టెడ్, యూనిస్‌లు అతన్ని సముదాయించటానికి ప్రయత్నించారు. వారి సంగతి మాత్రమేమిటి? వారూ దుఃఖంలో మునిగి ఉన్నవారే.

కొంతసేపటి తర్వాత జో కెన్నెడీ వివరాలకోసం అడిగాడు. అందరూ కన్నీరు పెట్టుకున్నారు. డాక్టర్ బోల్స్ రోగికి విశ్రాంతి అవసరం అన్నాడు. ఇది జరిగే పనికాదు. ఇక లాభం లేదనుకుని అతనికి వార్తా పత్రికలు చూపించారు. వాటిలో బొమ్మలు చూసిన జో కుప్ప కూలి పోయాడు డాక్టర్ మత్తుమందు ఇంజక్షన్ ఇచ్చాడు. అది పని చెయ్యలేదు. టెడ్ కెన్నెడీ సోదరుడికి ఫోన్ చేశాడు. నువ్వక్కడే ఉండి పెద్దవారిసంగతి చూడమని సూచించాడు ఎటార్నీ జనరల్.

ఇంత తెలిసిన తర్వాత టెలివిషన్ చూస్తే మాత్రం ఏమిటని దానికి కనెక్షన్ ఇచ్చారు. కొడుకు శవం, అంత్యక్రియల వివరాలు చూసి జో కెన్నెడీ వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టాడు చూస్తే బాధ, చూడకపోతే బాధగా ఉంది అతని పరిస్థితి

ఇంతలో అధ్యక్షుడి తండ్రి గుండె ఆగి పనిపోయాడనే పుకారు బయలుదేరింది దీనిని ఖండిద్దామా వద్దా అని ఆలోచించాడు టెడ్ కెన్నెడీ; చివరికి ఊరికే ఉండటం మంచిదనుకున్నాడు అతని తండ్రి వాషింగ్టన్‌కి వెడదామని నిశ్చయించుకున్నాడు. లేచి బట్టలు తొడుక్కొనటానికి ప్రయత్నించటం ప్రారంభించాడు. అతన్ని ఎవరూ నివారించలేక పోయారు. ఆన్ గార్గన్‌తో విమానాశ్రయానికి వెళ్లాడు. విమానం ఏదీ లేదు. ఇద్దరూ తిరిగి వచ్చేశారు.

అతన్ని మళ్లీ పడకో పెడుతూ అనుకుంది ఆన్‌గార్గన్-- తన ప్రయత్నం తను చేశాడు. అదేచాలు! పూర్తిగా దిగాలు పడి పోలేదన్నమాట !—

* * *

శనివారం సాయంత్రం గాల్‌బ్రెయిత్, ష్లెసింగర్‌లు ఎవరిల్ హారిమాన్ ఇంట్లో కలిశారు జాన్సన్ కోసం తను తయారు చేసిన ఉపన్యాస పాఠం గురించి చెప్పాడు గాల్‌బ్రెయిత్. కుంపట్లో చెయ్యి పెట్టినట్లయింది అధ్యక్ష పరంపర అన్నిటికన్నా ముఖ్యమయినదని గాల్‌బ్రెయిత్ వాదం అదే మాటని ఉపన్యాసంలో పొందుపరిచాడు. 'అధ్యక్ష పరంపర ఏ ఒక్క వ్యక్తి జీవితం కన్నా గొప్ప,' అని రాశాడు.

ఇది క్రూరంగా ఉందన్నాడు ష్లెసింగర్. కెన్నెడీ సాధించిన మహత్కార్యాలని గురించి రాయాలన్నాడు 'ఈ సాయంత్రం అంతా నా మీద దాడి తీస్తూనే ఉన్నాడు,' అన్నాడు గాల్‌బ్రెయిత్, తర్వాత తన 'జర్నల్'లో రాశాడు.

శ్రీమతి కెన్నెడీ బాబీ కోసం కబురు పెట్టింది. 'నేను పొద్దున్నే జాక్‌ని చూడాలి. శవ పేటికలో ఒక వస్తువుని పెట్టాలి,' అన్నది. బాబీకి ఆమె ఉద్దేశం అర్థం అయింది. ఇదే బాబీ ప్రత్యేకత. తనకి దగ్గర అయిన వారిని ఎప్పుడూ ఏ అనవసరమయిన ప్రశ్నలతోనూ బాధించడు. ఆ మాత్రం బాధ్యత తెలియకుండా ఏదీ చెయ్యరంటూ ఉంటాడు.

'సరే నేనిక్కడికి వస్తాను. ఇద్దరం కలిసి వెడదాము,' అన్నాడు.

అతను వెళ్లిన తర్వాత జాక్వెలిన్ కెన్నెడీ భర్తకి ఉత్తరం రాసింది. ఎంత సేపు రాసిందో తర్వాత జ్ఞాపకం లేదు ఆమెకి. కాని, ఆవేశపూరితాలయిన పేజీలు ఎన్నో రాసింది. అంతా రాసిన తర్వాత ఉత్తరాన్ని మడిచి ఒక కవరులో పెట్టింది. కవరుని అతికించింది. (ఇంకా ఉంది)

ఇ. వి, నాందేడు (మహారాష్ట్ర)

**కథలు, నవలలు వ్రాసేటప్పుడు కాగితానికి ఒకవైపునే వ్రాయాలా? రెండు వైపులా వ్రాయవచ్చా?**

ప్రెస్సుకి పంపదలచిన ఏ రచన అయినా కాగితానికి ఒకవైపుగానే వ్రాయాలి. అప్పుడు కంపోజిటర్లకి సుఖం. తగినంత మార్జిను కూడా వదలాలి అప్పుడు మూలలకి అక్షరాలుపోయి వారిని తికమకలు పెట్టవు.

డి. వి. జి. కె, చిత్రకొండ ఒరిస్సా

**మనిషిని మనిషిగా అర్థం చేసుకోవాలంటే ఏంచేయాలి?**

మనిషిలోని దైవత్వాన్ని ప్రతిక్షణం చూడగల్గాలి. దానికి ఓర్పు కావాలి

ఎం. ఎస్. బి, మద్రాసు

**ఒక వ్యక్తి ఎంతో కష్టపడి ఒక స్థానాన్ని సాధించేందుకు ప్రయత్నిస్తే అది జరగకపోతే ఎలా వుంటుంది?**

మనస్సు ఉసూరు మంటుంది. మళ్లీ ప్రయత్నించడం ప్రారంభించడమే దానికి విరుగుడు.

ఎన్. ఆర్. సి హెచ్. ఆర్, యాండికి

**కుమారునకు పెండ్లి అయిన తరువాత తల్లిదండ్రులు వుండరాదని బోధించేవారిని ఏమనాలి? అలా ఎందుకు చేస్తారు?**

వారి నేమీ అనక్కరలేదు— ఒకరు చెప్పిన మాటే వేదవాక్కు అని నమ్మే కుమారుణ్ణి కన్నందుకు ఆ తల్లితండ్రులే కించపడతారు. పోగా, కుమారునికి పెళ్లి అయాక అతని జీవితంలో భార్యకి ప్రథమస్థానం ఇవ్వడం అన్నది సహజం అన్న సంగతి పెద్దలు గుర్తించనంతకాలం ఇలా చెప్పిపెట్టడాలు, పోట్లాటలు, మానసిక చిత్రవధలు తప్పవు

కె. ఎల్. కె, నాగాయిలంక

**ప్రతి స్త్రీకి ముఖ్యమైన ఆభరణం ఏమిటి?**

స్త్రీగా హుందాగా మనగల్గడం.

టి. యు. ఎం, కర్నూలు

**మానవుని జీవితంలో ఒకరోజు విలువ ఎంత?**

ఇరవై నాలుగు గంటలు!

ఒక సోదరి, కాకినాడ

**'...నా కన్నీటి గాథకి ఏమిటి తరుణోపాయం?**

స్నేహానికి హద్దులు ఉంటాయి. అవిదాటితేనే మీకు వచ్చిన అవస్థలు. అయినా అబ్బాయి స్నేహితులని ఒకరికొకరు పరిచయం చేసుకోమని ఎవరు చెప్పారు?




సి. ఐ. ఆర్, కరీంనగర్

**వయసు ముదిరినా పడుచుగా కనబడాలని తాపత్రయపడుతూ— ఇరుగుపొరుగులతో కయ్యానికి కాలు దువ్వేవారిని ఏమనాలి?**

వారు పడుచుగా కనపడాలని తాపత్రయపడితే దానికి మీ అభ్యంతరం ఏమిటి మధ్య? ఇరుగుపొరుగులతో స్నేహంగా కాలక్షేపం చేయకల్గడం అన్నదొక కళ అది కష్టపడి అలవరచుకోవాలి దానికి కన్ని రూల్సు ఉన్నాయి. అందులో ముఖ్యమైనది 'అతి'గా పోకపోవడమే.

కె. ఎస్, హైదరాబాదు

**నేను కథలు గేయాలు పద్యాలు వ్రాశాను నా చేతి వ్రాత బాగుండదు శుద్ధ ప్రతి వ్రాసి పంపమంటారా?**

నాకెందుకు పంపడం? శుద్ధప్రతిని పత్రికలవారి కార్యాలయానికే పంపండి. చేతివ్రాత బాగుండకపోయినా ఫరవాలేదు వ్రాతప్రతి అలాగే ప్రచురించరు కదా

జె, నూజివీడు

**పద్మనాభంగారికి ప్రశ్నలు ఎలా పంపాలి?**

ఇలాగే 'ఎందుకు?' కని వ్రాయండి

ఎ. సి. ఎ, గుంతకల్లు

**సంతానం ఇక చాలు అనుకున్న భార్యాభర్తలు కేవలం స్నేహితులుగా మసలడం ఎంతవరకు సమంజసం?**

సంతానం కోసమే సంసారం అనుకునే ఆధ్యాత్మిక చింతనాపరులకది సాధ్యమేమో కాని మామూలు వారికి కాదు. నాటిగిల బ్రహ్మచర్యం నరమానవుని కెలా కుదురుతుంది. అందుకే కృత్రిమ కుటుంబ నియంత్రణా సరాలు ఏర్పడ్డాయి.

డి. వి, సికింద్రాబాదు

**ఒక యువతి ఒక యువకుని అవమానించినప్పుడు ఆమెపై ఏవిధంగా ప్రతీకారము తీసుకోగలడు?**

యువకులని అవమాన పర్చడం అర్థంలేని పని. అది కొరివితో తల గోక్కోవడం లాంటిది ... ప్రతీకారం వాంఛలకి పెద్దలులేం ఉంటాయి? జీతాలు పెంచితే మోతాదుకి మించి అల్లరికిదిగిన మన యువకులు ఎలా ప్రతీకారం తీర్చుకుంటారో ఎలా చెప్పగలం?

పి. డి, పర్లాకిమిడి

**నిజం ఒక్కొక్కరిపట్ల కొన్నివేళలలో విషంకన్నా బాధ కల్గిస్తుంది ఏమంటారు?**

నిజమే. నిజం నిప్పులా కాల్చకలదు విషంలాగ ప్రాణమూ తీయకలదు కాని అమృతంలాగ జీవమూ పోయకలదు.

బి. సి. కె, ఆలూరు

**తల్లులకి తమ తనయులు చిక్కిపోతున్నట్టు కన్పిస్తారేం?**

అది తల్లిహృదయాంకల ఆడదానికి గాని అర్థం కానిది తమ్ముడూ.

కె. కె, రామచంద్రపురం

**సంఘసేవ చేయాలని ఉందికాని ఎక్కడ ప్రారంభించడం?**

ప్రతిదానికీ ఒక సూత్రం ముఖ్యంగా గమనించాలి అదే - ఇంటగెలిచి రచ్చగెలువు మన్నది. తోటివారితో సహృదయంతో ప్రవర్తించ గల్గితే చాలు, సంఘసేవ చేసినంత.

టి. వి, హైదరాబాదు

**అమ్మాయిల వెర్రి వేషాలు మరీ పెచ్చు పెరిగిపోతున్నాయి దీనిని అరికట్టలేమా?**

వేషాలంటే ఫాషన్‌లని మీ ఉద్దేశ్యం అనుకుంటాను అవునా? పెరుగుట విరుగుట కొరకే అన్న సామెత వినలేదా? ఒకప్పుడు ఎంతో 'నాటీ'గా డ్రస్సు చేసుకు వీధుల్లోకి రావడం పాపము. ఇప్పుడో ఎంత 'సింపుల్'గా వెడితే అంత నాగరికత పెరిగినట్టుగా భావిస్తున్నారు మీరేం గాభరాపడకండి. కాలంతోపాటే ఫాషన్లవంటి వాటిని పట్టుకుని బెంగపడి పోకూడదు.

వి. పి, పుట్టగుంట

**నేను చదువుకోలేదు. అందుకు అనుక్షణం బాధపడుతున్నాను. చదువుకోనివారికి రోజులలో విలువఉండదా?**

ఎవరివిలువ వారిది? దానికీ చదువుకి లంకె లేదు. (కాని కనీసం చదువైన మెట్రిక్ దాకానైనా చదవడం మీకే మంచిది ) నేను చదువుకున్నాను. మా అమ్మ చదువుకోనిది అంతమాత్రంచేత ఈ రోజున అమ్మవిలువ తగ్గిపోయిందా? ●

# నిష్కామకర్మ



సృష్టిలో వున్న ప్రతి ప్రాణీ ఏదో పనిని చేస్తూనేవుంటుంది గాని స్థాణువులా వుండదు. అందులో పశు, పక్ష్యాదులు కేవలం తమ దైనందిన కృత్యాలను — అంటే ఆహార సంపాదన, విశ్రాంతి తీసుకోవడం, నిద్రించటం మొదలైన వాటిని జరుపుతూ కాలం గడుపుతాయి.

జంతువులూ, పశులూ మొదలైన యితర ప్రాణులకంటే ఎక్కువ జ్ఞానంవున్న మనుష్యుడు నిత్యకృత్యాలతో తృప్తిపడడు— పడకూడదు కూడా. కీర్తిప్రతిష్ఠలకోసంగాని తన ప్రయోజనంకోసంగాని, పరోపకారం కోసంగాని, దేశాభ్యున్నతికొరకుగాని ఏదయినా కర్మకు పూనుకోవాలి.

అట్టి కర్మ నెరవేరడానికి యత్నించడం మానవ ధర్మం!

తలపెట్టిన పనులన్నీ జరుగుతాయని చెప్పలేము. ఫలం మనచేతిలో లేదు. ప్రయత్నం పురుషాధీనం! అందుచేతనే భగవానుడు గీతలో

'కర్మణ్యే వాధికారస్తే
మా ఫలేషు కదాచన'

అని అన్నాడు — కర్మ చెయ్యడంవరకే మన బాధ్యత! దాని ఫలాన్ని పొందడంలో మనకు అధికారం లేదు!

'ఫలం లేని పనిని ఎందుకు ప్రారంభించాలి ?' అనే ప్రశ్న అందరికీ కలగడం సహజమే !

కార్యంవల్ల ఫలాన్ని ఆశించకూడదు, అంతేకాని ఫలం ఉండదని చెప్పలేదు. ఫలమే లేకపోతే భగవానుడు అర్జునుడిని యుద్ధానికి ప్రోత్సహించడం కుదురుతుందా?

ప్రయత్నిస్తే, ఫలితం కలుగుతుందని 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః' అని మన పెద్దలే చెప్పారు. ఒకవేళ ఫలం కలగకపోయినా విచారించకూడదు, మన ప్రయత్నంలో లోపం లేదని తృప్తిపడాలి! ఈ సంగతే

'యత్నే కృతే యది న సిద్ధ్యతి కోஉత్ర దోషః ?' అనే సూక్తి వివరిస్తున్నది

అయితే 'ఈ ప్రయత్నం సఫలమవుతుందో, కాదో — అనే అనుమానంతోటీ నిరుత్సాహంతోటీ పనిని ప్రారంభించకూడదు. నిరుత్సాహం వుంటే ఏ పనినీ చెయ్యలేము. 'సాధించి తీరాలి; సాధించి తీరుతాము' అనే పట్టుదల వున్నప్పుడే ఏ పనినయినా చేయగలుగుతాము

అది జరగకపోతే అదృష్టం లేదనుకోవాలి! కాని, ఏ కర్మనయినా కోరికతో చెయ్యకూడదు.

ఏదైనా కోరికను మనస్సులో పెట్టుకొని, పని చేస్తామనుకోండి ఆ పని జరక్కపోతే ఆ కోరిక వ్యర్థమవుతుంది. మనస్సు వికలమై పోతుంది. మనోవైకల్యం అనేక మానసిక రోగాలకూ, దేహారోగ్యాలకూ దారితీస్తుంది.

అందువల్లనే కామ్యకర్మలు కూడదంటారు పెద్దలు! మనం చెయ్యవలసినవి నిష్కామ కర్మలు మాత్రమే !

నిస్స్పృహతో చేసిన పనులు మనోవైకల్యాన్ని కలిగించవు. అటువంటి పనుల్లో మనస్సు కార్యాచరణపైనే తప్ప ఫలాఫలాల పయి లగ్నమై ఉండదు.

ప్రతిఫలాపేక్ష లేని యిట్టి కర్మను చేసి, దాన్ని భగవంతుడికే అప్పగించాలి.

ఏది చేసినా, అది భగవదర్పణమైతే శ్రేయస్సు కలుగుతుంది. భగవానుడు అర్జునుడికి దీనినే —

'యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ!
తత్కురుష్వ మదర్పణమ్'

అనే శ్లోకంలో తెలిపాడు.

'నీవు ఏదిచేసినా, ఏది తిన్నా, ఏమి హోమం చేసినా, ఏమి యిచ్చినా, ఏ తపస్సు చేసినా—ఓ అర్జునా! దానిని నాకే అర్పణం చెయ్యి; దానివల్లనే మేలు నీకు కలుగుతుంది' అని దీని అభిప్రాయం!

మనం ఏదైనా కోరికతో చేసేపనిని భగవదర్పణ చెయ్యడం సాధ్యపడదు దానికి నిష్కామ కర్మ మాత్రమే కావాలి! ●



ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

# మన మాల మిదం.....

*కె. రామలక్ష్మి



'నాకు ప్రాంపు దండగా నీకు ప్రైముదండగా'కాని నే చెప్పే విషయం వింటే నాకు పిచ్చి పట్టిందనుకుంటావు' అంటూ ఒక స్నేహితురాలు ఉత్తరం వ్రాసింది. 'ఎవరికేనా చెప్పాలన్నా నీలాంటి స్నేహితురాలికి రాద్దామన్నా నాకే — ఛీ యిలాంటి చిన్నవన్నీ పెద్ద సమస్యలు అనుకుంటే నవ్వుతారు' అనిపిస్తుంది. మా వారిని గురించి. ఆయన బ్యాంకులో పని చేస్తున్నారు! పని చేయడం ముగించడం అంటూ ఉండదాయనకి! అక్కడ బ్యాంకులో పని కాగానే యింటి దగ్గిర పని ప్రారంభం అవుతుంది — ఇక్కడా అంకెలే!! ఎటొచ్చీ అక్కడ బ్యాంకులో డబ్బు దాచుకున్న వారి లెక్కలు. ఇంట్లో నా యింటి లెక్కలు. నే చేసిన నయాపైసా కర్చు దగ్గిరనుంచి లిస్టు రాస్తారు. కూడతారు; తీసి వేస్తారు; దీని కెంతైంది, దీని కెంతైంది— అని భాగారాలు వేస్తారు. ఎప్పుడేనా కర్చు—అనవసరంది—చేస్తే కసురుకుంటారు. ఆదా చేస్తే ఎప్పుడూ ఎందుకిలా చెయ్యలేవు అని నిలవేస్తారు. పోనీ అని యింటి కర్చుల విషయంలో లోభత్వం ఏమాత్రం చూపరు. నాకని కూడా చిన్నచిన్న కర్చులు పెట్టుకోమంటారు. కాని అవన్నీ కూడా లెక్కల్లో వ్రాయాలి అంటారు అణా పిన్నులు కొనుక్కున్నాను, అర్ధణా చేబదులు యిచ్చాను అని రాయడానికి ఏమిటోలా ఉండదా? ఓ జాకెట్టు గుడ్డ కొనుక్కుంటే దానికి సవాలక్ష వివరణలు చెప్పవలసివస్తే ఆ కొనుక్కొన్న సరదా కాస్తా చచ్చిపోదా?... మాకు పెళ్ళయిన కొత్తలో యిలా లెక్కలు వ్రాయమంటూంటే ఏదో హాస్యానికి అనుకునేదాన్ని. తరవాత కొన్నాళ్ళకి అది వారికి అలవాటు అనుకోవడం ప్రారంభించాను. కాని యిప్పుడిది నాకు అవస్థగా తయారైంది నాకు ప్రాణం విసగడం ప్రారంభించింది. ఒక సారి ఆ సంగతే వారిలో అంటే ఆయన ఆశ్చర్యానికి అంతులేదు. 'మనిద్దరి భవిష్యత్తుకోసంగాని యిదంతా నా ఒక్కడికోసము అనుకోకు' అంటూ మందలించారు. 'మనం అప్పులపాలై పోకుండా ఉండడానికి కివి ఎంతో ఉపకరిస్తాయి' అంటూ తెలియచెప్పారు. ఆయన చెప్పినదీ నిజమే అనిపిస్తుంది. కాని ప్రతి నయాపైసా యిలా నిలదీసి అడిగినప్పుడు మటుకు పోయి ఏదైనా ఉద్యోగం చేసుకుంటూ హాయిగా ఆర్థికంగా కూడా స్వతంత్రంగా ఉందాం' అనిపిస్తుంది. ఇలాంటి భర్త నీకుంటే ఏం చేస్తావు?' అంటూ మధ్యని నన్ను నిలదిసింది. బాగుంది! వెనకటి కొక పెద్దమనిషి కొత్తగా పెళ్ళయిన దంపతులకి నీతి బోధిస్తూ' మల్లెపూలా? జాజిపూలా? తెల్లచీరా? నీలిచీరా? అన్న విషయాలమీద కావలసినంత దెబ్బలాడుకోండి. మాటలు మాడుచుకోండి. అంతేగాని డబ్బు విషయంలో ఎప్పుడూ బేధాభిప్రాయాలు రానివ్వకండి' అన్నాడు. ఆయన మాటలలోని నిజం నిలకడమీదగాని తేలదు. ఇతర విషయాలు, అంత ముఖ్యంగాని విషయాలపట్ల భేదాభిప్రాయాలు భార్యాభర్తలను దగ్గిరకి చేరుస్తాయి. కాని డబ్బు విషయంలో తేడాలు వస్తే ఆ సంసారంలో చిన్న చిచ్చు తలెత్తినట్టే అది కార్చిచ్చయ్యి సంసారం సర్వనాశనం కాకుండా చూసుకోవడం ఏంతైనా ముఖ్యం.

కర్చు పెట్టేవారు, ఆ కర్చు ఎలా జరుగుతుంది అన్నది తెలుసు కుందుకు పద్దు రాసుకోవడం ముఖ్యమే. కాని ఈ కర్చు తమ స్వంతానికేగాని సంజాయిషీ చెప్పడానికి కాకూడదు. ఇల్లన్నాక ఒక పావలా యిటూ, ఒక అర్ధరూపాయి అటూ కర్చుకాక తప్పదు. అంతమాత్రానికే భార్యని అనుమానించే భర్తలూ, అంతమాత్రానికే భర్తని ఆడిపోసుకొనే భార్యలూ తయారు కాకూడదు. స్వంత కర్చుకని భార్యలకి పావలా పరకో యిచ్చే భర్తలే చాలా అరుదు. పెద్ద స్వంత కర్చు ఏమిటి ఉంటుంది? అని అడక్కండి. తోచి ఎవరికేనా ఓ రూపాయి యివ్వాలన్నా నలుగురమ్మలక్కలతో పాటు పూలు కొనుక్కోవాలన్నా కూడా జంకే గృహిణులే ఎక్కువ. ఇంక ఇచ్చిన ప్రతిపైసా లెక్క చెప్పమని వేధించే వారి కంటే అసలు యివ్వని వారే ఉత్తములేమో!

నా స్నేహితురాలి భర్త నిజంగా దూరదృష్టికల యువకుడు. అందుకే సంసారం అప్పులపాలు అయిపోకుండా కర్చు లెలా అవుతున్నాయన్నది ఓ కంట కనిపెడుతూ ఉంటాడు. ఎటొచ్చీ అతనితో వచ్చిన చిక్కు — నయాపైసాల లెక్కలో కోట్ల విలువ చేసే భార్య మనస్సు నొచ్చుకోవడం అన్నది గమనించక్క పోవడమే. ఇలాంట చిన్న చిన్న విషయాలే చిలికి చిలికి గాలివానగా తయారు అవుతాయి. ఇటువంటి పరిస్థితి నుంచి తప్పించుకోడానికి రెండుదార్లు తోస్తాయి. ఒకటి — ఏ

(64వ పేజీ చూడండి)

ట్రాన్స్‌లేషన్ బహుమతి

# పల్లెలలో కుటుంబనియంత్రణ అత్యావశ్యకం

మాతృత్వం పొందాలని ప్రతిస్త్రీ ఆరాట పడుతుంది. తన కడుపుపంట నోముల పంట అని మురిసిపోతుంది గాని దీనికి పరిమితి అంటూ వుండాలి. రోజరోజుకీ పెరిగిపోతూన్న జనాభాకు తిండి కూడా వుండదు. ఇంకా ఎన్నో అనర్థాలున్నాయి ఇది గమనించిన ప్రభుత్వం కుటుంబ నియంత్రణకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చి అనేక పథకాలువేసి ఉద్యమాలు ప్రారంభించింది ఈ వుద్యమాలు ఎంతవరకు విజయవంత మవుతున్నాయో పరిశీలిద్దాం.

కుటుంబ నియంత్రణ దృష్ట్యా దేశంలో ప్రజలను రెండు తరగతులుగా విభజింప వచ్చును. 1. పట్నవాసులు, 2. పల్లె ప్రజలు, కాయకష్టము చేసుకొనేవారు.

మొదట పట్నవాసుల విషయం చూద్దాం. ప్రభుత్వం వుద్యమం ప్రారంభించకముందే (పద్దెనిమిది, పందొమ్మిది సంవత్సరాల క్రితమే) బాగుగా చదువుకొన్నవారు కొందరు కుటుంబ నియంత్రణ పద్ధతులను అవలంబించడం మొదలెట్టారు. ఈమధ్య మూడవ తరగతి మాత్రమే చదివిన భార్యలు, ఎనిమిదవతరగతిమాత్రమే చదివిన భర్తలుకూడ యీ పద్ధతులు అవలంబించడం అందరకూ తెలిసిన విషయమే. వృద్ధవనితలు కూడా 'చాలు తల్లీ నీకు ముగ్గురు పిల్లలు' అని కూతుళ్ళు, కోడళ్ళతో అనడం చాలాచోట్ల వినకపోలేదు! (పూర్వాచార పరాయణులైన వృద్ధవనితలు సహా!) వీటినిబట్టి చూస్తే ఎటువంటిబోధలూ, ప్రచారముల ఆవశ్యకత లేకుండానే పట్నాలలో ఆనోటా, ఆనోటా ప్రచారమవుతున్నది. కనడానికి, పెంచడానికి శక్తిలేక పట్నవాసపు స్త్రీలు కొందరు భర్తలకంటె తామే ముందంజవేస్తున్నారు. స్త్రీలనోటవినా, 'ఇద్దరు పిల్లలు చాలు తల్లీ' లేక 'ముగ్గురుపిల్లలు చాలు తల్లీ' 'పోషిస్తు పెట్టలేము, పాటుపడలేము' అనే వారి భర్తలుకూడా వారితో ఏకీభవిస్తూనే వున్నారు. పట్నాలలో మధ్యవయస్కులకు ఎక్కడ చూచినా పరిమిత కుటుంబాలే పది మంది పుట్టిన తరువాత కూడా ఆపరేషన్ చేయించుకొన్న వాళ్ళున్నారు, యింకా వారి కుటుంబాలు పెరిగిపోకుండా! షాపులలో సాధనాలు అందరికీ కనబడేలా అద్దాల బీరువాలలో వుంచుతున్నారు. పెళ్ళికాని ఆడ, మొగపిల్లలందరకూ యీ రోజుల్లో వివిధ సాధనాలు తెలుసు!

ఇక రెండవ తరగతికి చెందిన వారి విషయం చూద్దాం. పట్నంప్రజలకంటే వీరి జనాభానే చాల ఎక్కువ. రేడియోలో గ్రామస్థుల కార్యక్రమం ఎంతమంది వినగల్గుతున్నారు? — చాలా గ్రామాలలో అందరికి అందుబాటులో రేడియోలు లేకపోవడంవల్లనైతే నేమి, ఎప్పుడైనా వారు సినిమా ట్రయల్ పార్కులో చూసినా అది అప్పుడే అక్కడే మరిచిపోతారు. చిన్న వయస్సులోవున్న హెల్తు విజిటర్లు పల్లెలకు వెళితే 'పెళ్ళికాని పిల్లవి నీకేమి తెలుసు పోవమ్మా' అంటారు. మరొక విజిటర్ని 'మేం పిల్లల్ని కంటే నీకేమి? నువ్వు పెట్టాలా, పోషించాలా? కడుగో, గంజో తాగి మేమందరం బ్రతుకుతాం. మాకు పిల్లలే డబ్బు' అంటారు. మరి కొందర్ని 'మాకు నీతులు చెప్పడానికి వచ్చేవ్వా, ఏమీ అక్కరలేదులే పోమ్మా' అంటారు. మళ్ళా మాట్లాడుతే మక్కెలిరగ్గొడతారని 'బ్రతుకు జీవుడా' అని బైట పడతారు పాపం హెల్తు విజిటర్లు.

## డాక్టర్ కబుర్లు

### కడుపులో పుళ్ళు

ఈమధ్య కడుపుని "చల్లార్చి" లోపలి లోపలి పుళ్ళని నయం చేస్తున్నారు. మునుపంతా దీనికి ఎన్నో రకాల పథ్యాలు, శస్త్రచికిత్సలు అవసరం అయ్యేవి.

ఇది ఎల చేస్తారు? గాలి తీసిన బెలూన్ని రోగి చేత మింగించి అందులోకి 1.6 డిగ్రీల ఫారన్‌హీట్ ఉష్ణోగ్రత కల చల్లని సారాయాన్ని పంపిస్తారు. సారాయిం వెళ్ళిన కడ్డీ బెలూన్ ఉబ్బుతుంది. మళ్ళీ దానిని పంపుతో తీసివేసి కొత్త సారాయిం పంపుతారు. ఇలా గంటసేపు చేసిన తర్వాత కడుపు చల్లపడి లోపల ఆమ్లం తయారుచేసే గ్రంధులు పనిచెయ్యవు.

ఇలా 'చల్లబడటం' వల్ల కడుపు పంచికి ప్రమాదం ఏదీ ఉండదు. అంతే కాక పరిస్థితి మెరుగు పడుతుంది కూడా.

ఆమ్ల వస్తువులు ఏర్పడవు కాబట్టి 'డువోడునమ్' అనే గర్భభాగంలో సాధారణంగా ఏర్పడే పుళ్ళు రేగవు

కడుపులో ఆమ్లం మునుపటి వారు అనుకున్నంత ముఖ్యంకాదు. అసలు, కడుపు పంచీ లేకపోయినా మనిషి బతికిపోగా. ఆహారం జీర్ణానికి పేగులు చాలు. కాని, 'చల్లబరచడం' చేత కడుపు పంచీ



2.

మీద శస్త్ర చికిత్స అనవసరం. పుండు రేగదు.

హెచ్. ఎల్. హార్టిన్‌సోన్

( కాపీరయిటు )






# ఆశా మగువల అందమునకు మెఱుగులు దిద్దును

ఆశా స్నో మరియు పౌడరును ఉపయోగిస్తే మీ ముఖ వర్చస్సు
సొగసుగా, సహజముగా వెలుగొందును. వీటితో మీ ముఖ
చర్మమును మృదువుగా మనోహరముగా చేసుకోండి.

నల్లని ఆకర్షణీయమైన మీ కళ్లకు ఆశా కాటుకను కను
రెప్పలకు దిద్దుకోండి. కారునలుపైన ఆశా కాటుక
మీ కళ్లకు చల్లదనమును హాయిని యిస్తుంది.

ముస్తాబు పూర్తి చేయుటకు ఆశా కుంకుమతో బొట్టు
పెట్టుకోండి. ఇది దీప శిఖవంటి ఎరుపు, ముదర ఎరుపు,
నలుపు, మూడు రంగులలో లభించును.



Asha

ఫేస్ పౌడరు • స్నో • కాటుక • కుంకుమ







V-13-Tel

# వ్యాసరచన పోటీలో బహుమతిపొందిన రచయిత్రులు—వివరాలు

**కన్సొలేషన్ బహుమతి**

శ్రీమతి ఉమా వెంకట్రామన్

వయస్సు 28 సంవత్సరాలు. విద్యార్హత బి. ఎస్‌సి. బి. ఎడ్. శ్రీవారి ఉద్యోగరీత్యా బొంబాయిలో నివాసం. పత్రికలకు అప్పుడప్పుడు వ్యాసాలు వ్రాయడం, పుస్తకాలు చదవడం ఇష్టం. ఇంతకుముందు ఆంధ్రపత్రికలో "పిడికెడు స్వర్గం" "అపార్థం" 'పట్టుపరికిణీ' కథలు "[illegible]" పేరుతో ప్రచురింపబడ్డాయి. నాలుగు సంవత్సరాల కుమారుడు ఒక్కడు.

**కన్సొలేషన్ బహుమతి**

శ్రీమతి ఈశ్వరిగారి
ము త్యేశ్వరీ నరహరిశర్మ

పుట్టి పెరిగినా, మెట్టినవూరూ కరీంనగర్ జిల్లాలోని 'వేములవాడ'. విద్యాభ్యాసం సామాన్యం. పత్రికలకి, రేడియోకి రచనలు వ్రాయడం అంటే సరదా.

ఆగస్ట్ 20న స్త్రీల కార్యక్రమంలో ఆకాశవాణి హైదరాబాదు రేడియో కేంద్రంనుండి 'పుట్టి[illegible]' నాటిక ప్రసారమైంది.

**కన్సొలేషన్ బహుమతి**

శ్రీమతి ఎం. కమలాదేవి

పుట్టి పెరిగినది, విద్యాభ్యాసము విజయనగరంలో. మెట్టినిల్లు విశాఖపట్నం. ముగ్గురుపిల్లలు 14 సంవత్సరాల కుమారుడు—8 సం, 4 సం. కుమార్తెలు. భర్త భూగర్భభౌతిక శాస్త్రంలో డాక్టరేట్ తీసుకొని, 11 సం నుండి బీహారు రాష్ట్రంలో వున్న ధన్‌బాద్ మైనింగ్ కాలేజీలో ఉద్యోగము. పత్రిక వేటల్లో నా సరదా, హాస్య రచన, పుస్తక పఠనము అలవాట్లు. 'శ్రావణి' వీరి కలం పేరు.

---

పల్లె ప్రజల మనస్తత్వాలే వేరు.

ఈ పల్లె ప్రజలకు కొందరంటే గురి —మునసబు, కరణం, పోస్టుమాస్టరు, స్కూలుమాస్టర్లు మొదలైనవారు. ప్రతి తాలూకాలోను వున్న యీ ప్రముఖులను ఆ తాలూకాలో ఒకచోట సమావేశపర్చి వారికి ఉపన్యాసాలు, ఇన్‌ఫర్‌మేషన్ రీల్సు, కరపత్రాలు ద్వారా బాగుగా బోధించాలి. వారు తిరిగి వారి స్త్రీలకు బోధించాలి. గ్రామంలో ప్రముఖ స్త్రీలను సమావేశపర్చి, స్త్రీలే ఉపన్యాసాలిచ్చి చర్చలలో పాల్గొనాలి. ఈ విధంగా తెలుసుకొన్న ప్రముఖ స్త్రీ పురుషులు వారి వారి పల్లెలలో ప్రజలకు క్రమేపి తెలియజేయగలరు. ఈ విధంగా కొంత లాభముంటుందేమో గాని, కేవలం వుద్యోగరీత్యా వెళ్ళే హెల్తు విజిటర్లు మొదలైనవారివల్ల ఏమంత లాభం వుండదేమో.

వివాహ వయస్సు ఎక్కువ చేయడంవలన ఏమీ ప్రయోజనం లేదు. పట్నాలలో చదువులవల్లనో, ఆర్థిక పరిస్థితులవల్లనో, కట్నాలు యిచ్చుకోలేకనో ఆడపిల్లల పెళ్లి

## కుటుంబనియంత్రణ...

వయస్సు 20, 22 దాటుతూనే వుంది! కాయకష్టము చేసుకొనేవాళ్లకు వయస్సే తెలియదు. వివాహ వయస్సు చట్టబద్ధము చేస్తే వారిలో అవినీతికి దారితీయవచ్చును. ఇంతకూ స్త్రీ 30 సంవత్సరాలకు పెళ్లి చేసుకొన్నా సునాయాసంగా పదిమందిని కన గలదు! అదే కుటుంబనియంత్రణ పద్ధతులను అవలంబించే స్త్రీ పదిహేడు సంవత్సరాలకు పెళ్లి చేసుకొన్నప్పటికీ ఇద్దరినో, ముగ్గురునో కని వూరుకోగలదు!

మహిళాసంఘాలు, స్త్రీసమాజాలు మొదలైన వాటి కృషి చాలావుంది. ఈ సంఘాలలో ఉపన్యాసాలు, చర్చలు జరగాలి. ప్రభుత్వం అటువంటి క్రొత్త పథకాలు వెయ్యాలి సంఘసభ్యులు, ముఖ్యంగా 40 సంవత్సరాలు పైబడ్డవారు, హెల్తు విజిటర్లు మొదలైన వుద్యోగినుల సహాయంతో పల్లెలకు తరుచువెళ్లి ప్రచారం చెయ్యాలి. వీరికి తగినసౌకర్యాలు ప్రభుత్వం యివ్వాలి. పట్నాలలోకూడా కొంతమంది, వివిధసాధనాలు తెలిసినప్పటికీ పాపభీతివలననో లేక ఏమైనా జబ్బులు వస్తాయనో భయపడుతున్నారు. సంఘసభ్యులు, ఉద్యోగినులు వీరికి బోధించగలరు. కేవలం ఉద్యోగదృష్టితో కాకుండా 'సంఘసేవ'అనే దృష్టితో కృషిచేయవలసిన బాధ్యత వనితల మీదవుంది.

జనాభా అరికట్టడంవలన పాపం చుట్టుకొంటుందని కొందరి పల్లెప్రజలు అభిప్రాయం. అటువంటి భయంపోగొట్టే పథకాలు ప్రభుత్వంవెయ్యాలి. వీరి ఆర్థిక, సాంఘికపరిస్థితులను, మనస్తత్వాలను మనస్సులో వుంచుకొని వాటికి అనుగుణ్యంగా ప్రభుత్వం పథకాలు వెయ్యాలి. పట్నప్రజలకు, పల్లెప్రజలకు ఒకేరకమైన ప్రచారాలు, పథకాలు పనిచెయ్యవు.

ఒక్కమాట చెప్పాలంటే పల్లెలలో జనాభా అరికట్టబడినట్లయితే దేశంలో అరికట్టబడ్డట్లే.

—శ్రావణి

### కన్సొలేషన్ బహుమతి

# మనదేశంలో కుటుంబనియంత్రణ

మనదేశంలో ప్రతి నిమిషానికి పదిమంది శిశువులు దుర్భరమైన ఈ వాతావరణంలో జన్మిస్తున్నారు. ఈ వ్యాసం చదవడం పూర్తిచేసేసరికి కనీసం పాతికమందైనా జన్మించివుంటారు. మనదేశ జనాభా గూర్చి తెలుసుకోబోయే ముందు, ప్రపంచ జనాభా గూర్చి తెలుసుకోవడం అవసరం.

1960 లో 300 కోట్లుగా ఉన్న ప్రపంచ జనాభా క్రీ. శ. 2000 సంవత్సరాలనాటికి 700 కోట్లకు పెరిగే ప్రమాదం ఉంది. ప్రస్తుతం ప్రపంచ జనాభా సుమారు 330 కోట్లు. ప్రతిరోజు 165 వేలకు పెరుగుతుంది.

1961 నాటికి ఒక్క భారతదేశంలో 43.68 కోట్ల జనాభా ఉంది. ఇంకా ఇదివ విధంగా మనదేశ జనాభా పెరుగుదల ఉండగలదు.

1964 లో — 47.2 కోట్లు
1976 లో — 64.8 కోట్లు
1986 లో — 58.6 కోట్లు

మరణిస్తున్న వారి సంఖ్య తొలగించగా, వారి స్థానాల్ని భర్తీచేస్తూ నిమిషానికి పది మంది చొప్పున జన్మిస్తున్నారు మనదేశంలో. అంతే కాదు ఒక్క రోజులో 30,000 మంది శిశువులు జన్మిస్తున్నారు.

ప్రమాదకరమైన ఈ జనాభా పెరుగుదల అరికట్టలేనిపక్షంలో మన 50 కోట్ల జనాభా మరో పాతిక సంవత్సరాల్లో రెట్టింపు కాగలదంటే ఆశ్చర్యం లేదు

ఈ జనాభా పెరుగుదలని అరికట్టడానికి భారతప్రభుత్వం కుటుంబ నియంత్రణను జాతీయ విధానంగా ఆమోదించి పంచవర్ష ప్రణాళికల్లో దీనికి ప్రముఖ స్థానాన్ని కల్పించింది. పంచవర్ష ప్రణాళికల్లో వెచ్చించిన మొత్తాలు—

ప్రథమ పంచవర్ష ప్రణాళిక: 65 లక్షల రూపాయలు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక: 460 లక్షల రూపాయలు.

తృతీయ పంచవర్ష ప్రణాళిక: 25 కోట్లు.

చతుర్థ పంచవర్ష ప్రణాళికకు 95 కోట్ల రూపాయలను కేటాయించింది.

**అందువల్లనే ప్రభుత్వం జనాభా పెరుగుదలని** తీవ్రంగా భావించి కుటుంబ నియంత్రణకోసం రాష్ట్ర, జిల్లా, పంచాయతీ సమితులస్థాయిలో కుటుంబ నియంత్రణ కేంద్రాల్ని స్థాపిస్తుంది. కోట్లకొలది ధనం వెచ్చిస్తుంది.

ప్రచారకులు గ్రామ గ్రామాలకు వెళ్లి గ్రామీణప్రజలకు కుటుంబ నియంత్రణ ఆవశ్యకత గూర్చి బోధిస్తున్నారు.

గ్రామీణాల్లో ఇంకా అజ్ఞానబీజాలు తొలగనందున కుటుంబ నియంత్రణను వారు భగవంతుని సృష్టికి ఆటంకంగా, అపచారంగా, ఘోరకిరాతకచర్యగా" భావిస్తున్నారు.

ప్రచారకులు వెళ్లి కుటుంబ నియంత్రణ గూర్చి గ్రామీణులకు బోధిస్తే—"సరేగానీ అమ్మడూ! నీకు పెళ్లయిందా? ఎంతమంది పిల్లలు??" అని ఒకరు; "ఇంతకీ నీవు చెప్పేదాన్ని నీవాచరించావా?" అని మరొకరు, "ఇంతమందినికన్న మాకే నీతులు చెప్తుందే? ఎళ్లెళ్లు. తేరగావొచ్చిన జీతం డబ్బులు దండుకొంటూ శ్రీరంగనీతులు మహాబాగా చెప్తున్నావులే. పెళ్లికాని బుల్లెమ్మ గారూ ఇక దయచేయండి మాకావల బోలెడు పనులున్నాయి" అని మరో మహాతల్లి, ఆ సోదరి మొహంమీదే.

కుటుంబ నియంత్రణ అమలు జరిపితే వారికీ దేశానికి ఏవిధంగా క్షేమమో అర్థం చేసుకొనేలా చెప్పితే ఏనాటికైనా వారు సత్యాన్ని గ్రహించకపోరు.

ఐతే వారు ఆ సత్యాన్ని గమనించి ఆచరణలో పెట్టేవరకు నిరీక్షించాలంటే జనాభా సమస్య మరింత తీవ్ర రూపం దాల్చవచ్చు, కాబట్టి ప్రభుత్వం ముగ్గురికన్నా హెచ్చుగా పిల్లల్ని కన్నవాళ్లకు (ఇకముందు కనబోయే వాళ్లకే) ప్రస్తుతం కల్పిస్తున్న వసతులు, సౌకర్యాలు, హక్కుల్ని రద్దు చేయాలి. గృహాలకు నీటి సరఫరా, విద్యుత్తు సరఫరా మొదలైన సౌకర్యాల్ని, పిల్లలకు విద్య, వైద్య ఆరోగ్య వసతుల్ని రద్దుచేయాలి. వారు ప్రభుత్వోద్యోగులైతే వారి ఇంక్రిమెంట్లని తగ్గించాలి. అవసరమైతే జీతాల్ని కూడా తగ్గించాలి అందులో వారు రైల్వే ఉద్యోగులైతే వారికీ, వారి పిల్లలకి ఫ్రీ రైల్వే పాసుల్నిచ్చే అవకాశాన్ని రద్దు చేయాలి. ముగ్గురికన్న హెచ్చుగా పిల్లలు కలగకుండా విధిగా 'స్టెరిలైజు' చేయించుకోవాలని శాసనం చేయాలి. ఐతే అది శారదా ఆక్ట్, వరకట్న నిషేధ చట్టాల్లాగా కాకుండా పటిష్టంగా ఉండాలి.

ఆ శాసనాల్ని అమలు పరచడం ఎవరికోసమో కాకుండా, తమకూ, తమ పిల్లల భవిష్యత్ జాగ్రత్తకోసమేనన్న సత్యాన్ని ప్రజలు గ్రహిస్తే కుటుంబ నియంత్రణ శాసనం విధిగా విజయం పొందితీరుతుంది.

స్టెరిలైజ్ చేయించుకొన్న పురుషులు కనీసం మూడుమాసాలపాటైనా సైకిల్ తొక్కరాదు కాబట్టి దిగువ తరగతి ఉద్యోగులు ఆఫీసులకిరిక్షాల్లో, బస్సుల్లోవెళ్లాలంటేపెక్కు ఆర్థికచిక్కులకిలోనైతారు.

స్త్రీలైతే కనీసం వారం పదిరోజులైనా ఎలాంటి పనీ, పాటా లేకుండా విశ్రాంతి తీసుకోవాలి. రెక్కాడితేకానీ డొక్కాడని స్త్రీలకు దీనివల్ల నోటి ముందటి బుక్క దూరం కావాల్సివొస్తుంది

స్టెరిలైజ్ చేయించుకొంటే ఆర్థికంగా, వారికి కలిగే నష్టాల్ని పూడ్చడానిగ్గాను ప్రభుత్వం పురుషులకు 30 రూపాయలు, స్త్రీలకు 50 రూపాయలు బహూకరిస్తే, పురుషులు, స్త్రీలూ చాలామంది స్టెరిలైజ్ చేయించుకోవడానికి ముందుకొస్తారు.

కుటుంబనియంత్రణ వేసక్టమీ ఆపరేషన్ చేయించుకొన్న ప్రతివారికీ ఒక ట్రాన్సిస్టర్ రేడియో బహూకరించే పథకాన్ని ప్రభుత్వం చేపట్టాలని ప్రభుత్వం ఆలోచిస్తుందను విషయాన్ని కేంద్ర ఆరోగ్య శాఖమంత్రిడాక్టర్‌చంద్రశేఖర్ వెల్లడించారు.

కుటుంబనియంత్రణ ఆచరణదారులసంఖ్య విశేషంగా పెరగడానికిది దోహదకారికాగలదు.

కుటుంబనియంత్రణ విధానం గూర్చి ఇంకా చురుకుగా ప్రచారం చేయాల్సిన అవసరం ఎంతైనాఉంది.

శాసనం, ప్రజానీకంతో — ముఖ్యంగా గ్రామీణుల్లో ప్రబోధం, శక్తి సామర్థ్యాలు గల డాక్టర్లను ఈ ఉద్యమంలో చేర్చుకోవడం, వేసక్టమీ ఆపరేషన్ చేసే డాక్టర్లకి అదనపు ఇంక్రిమెంట్లని ఇవ్వడం **కుటుంబనియంత్రణ ప్రచారకులుగా ఉత్సాహ**

వంతులైన కార్యకర్తల్ని నియమించడం, మొదలైన చర్యలు ఈ ఉద్యమం విజయవంతం కావడానికి ఎంతైనా తోడ్పడగలవు.

ఎప్పుడు రేడియో ఆన్ చేసినా కుటుంబ నియంత్రణ గూర్చి అదేపనిగా, శ్రోతల మనస్తత్వమైనా గ్రహించకుండా, తమకే శోషవచ్చేలా, శ్రోతలకి బోర్ కొట్టించి రేడియో పగలెయ్యాలనేంత ఇదిగా ఈమధ్య ప్రసారాలు చేస్తున్నారు.

దీనివల్ల కుటుంబ నియంత్రణ పదమంటేనే వెగటు పుట్టే ప్రమాదం ఉంది. కాబట్టి ఆసక్తికరంగా ఉండేవిధంగా. రేడియో ప్రసంగాల్ని ఏర్పాటు చేయించాలి.

పత్రికలద్వారా రోజురోజుకు హెచ్చుతున్న జనాభాసమస్యనుగూర్చి ప్రచారంచేయించాలి. కుటుంబ నియంత్రణకు సంబంధించిన ఫిల్మ్‌లను ప్రదర్శింపజేయాలి.

జనాభాపెరుగుదల నరికట్టడానికి బాలికల వివాహ వయస్సు 25 వరకు పెంచాలన్న అభిప్రాయం హాస్యాస్పదం. దీనివల్ల జనాభా తగ్గుదల అంతగా ఉండకపోవచ్చు. నేడు ఇరువది సంవత్సరాల వయస్సులో నే పెళ్లిళ్లు జరుగుతున్నా బాలికల నైతిక విలువల్నిగూర్చి యింటా బయటా వాదోపవాదాలు చెలరేగుతున్నాయి

అలాగే 1967–68 సంవత్సరాన్ని నిస్సంతాన సంవత్సరంగా పరిగణించాలని కేంద్ర ఆరోగ్యశాఖామంత్రి సలహా 'పిచ్చి కుదిరింది రోకలి తలకు చుట్టమన్న' సామెతను జ్ఞప్తికి తెస్తుంది.

ఇలాంటి వెర్రి మొర్రి సలహాలు, కార్యక్రమాలు చేయకుండా నిర్మాణాత్మకమైన చర్యల్ని గైకొని ఈ ఘోర విపత్తునుండి ప్రభుత్వం మనల్ని రక్షిస్తుందని ఆశిద్దాం. దానికి మన సహకారం కూడా అవసరమేనన్న విషయం మరవరాదు.

కేంద్ర మాజీ ఆరోగ్యశాఖా మంత్రిణి డాక్టర్ సుశీలానయ్యర్ ఓ సందర్భంలో అన్న మాటల్ని పేర్కొంటూ ఈ వ్యాసాన్ని ముగిస్తున్నాను.

"తమ పిల్లలకు తినడానికి తిండి, కట్టడానికి బట్ట సమకూర్చలేని తల్లిదండ్రులకు, చదువు చెప్పించలేని తల్లిదండ్రులకు వారిని కనే హక్కులేదు"

—శ్రీమతి ఈశ్వరిగారి

ముక్తేశ్వరీ నరహరిశర్మ ●

# వల్లభాచార్యుడు

1479లో, వారణాసిలో కొందరు సన్యాసులూ, మహమ్మదీయులూ పోట్లాడు కున్నారు. వీరి పోట్లాటని చూసి భయపడినవారు కాశీ వదిలి దూర ప్రాంతాలకి పారి పోయారు. లక్ష్మణభట్టు వీరిలో ఒకడు. ఇతను తైలాంగ్య బ్రాహ్మణుడు. అప్పటికి లక్ష్మణభట్టు భార్య గర్భవతి. వారి ప్రయాణం చాలా కష్టమయి పోయింది. వారి బిడ్డ చంపారణ్యంలో జన్మించాడు. ఈ బిడ్డ జన్మించగానే ఆ అడవిలో ఒక పెద్ద రాజభవనం ప్రత్యక్షమయిందిట; దేవతలు పుష్పవర్షం కురిపించారుట; కృష్ణ భగవానుడే స్వయంగా తలిదండ్రులతో తమ బిడ్డ తన అవతారమనీ, అతన్ని అక్కడే వదిలి పోవచ్చుననీ చెప్పాడుట. వారు దైవాజ్ఞని పాటించి బిడ్డని వదిలి తమ ప్రయాణం కొనసాగించారు. ఇంతలో కాశీ అల్లర్లు తగ్గిపోయాయనే వార్త వారికి అందింది. వెంటనే తిరుగుముఖం పట్టారు. దారిలో బిడ్డని వదిలిన చోటు మళ్ళీ తటస్థించింది. శిశువు అక్కడే ఉన్నాడు. హోమం ఉంటే ఆడుకుంటున్నాడు.

అతన్ని తీసుకుని ఇంటికి వచ్చేశారు. లక్ష్మణభట్టు పిల్లవాడికి వల్లభుడనే పేరు పెట్టాడు. కొంతకాలం తర్వాత లక్ష్మణభట్టు యమునానదీ తీరం మీది గోకులానికి మారిపోయాడు.

వల్లభుడు చిన్నప్పటి నుంచే గొప్ప మేధా శక్తిని ప్రకటించాడు. పదకొండవ ఏటికే నాలుగు వేదాలూ, ఆరు శాస్త్రాలూ, పద్దెనిమిది పురాణాలూ చదువుకున్నాడు. ఈ వయసులోనే తండ్రిని పోగొట్టుకున్నాడు. దానితో వల్లభుడు కాశీకి తిరిగి వచ్చేశాడు.

ఒక సంవత్సరం తర్వాత దక్షిణదేశ తీర్థయాత్ర ప్రారంభించాడు. అతను సందర్శించిన చోట్లలో విజయనగరం ఒకటి. వల్లభుడి తల్లివైపు పూర్వీకులు కొందరు ఇక్కడ ఉన్నారు

వల్లభుడు విజయనగరంలో ఉన్నప్పుడు ఒక అద్భుతం జరిగింది. శ్రీకృష్ణదేవరాయల సభలో శైవ వైష్ణవ వివాదం ఒకటి జరుగుతోంది. 12 సంవత్సరాల బాలుడు, వల్లభుడు వైష్ణవ పక్షం తీసుకుని శైవుల పక్షాన్ని ఓడించాడు. రాజాగారు అతని తెలివికి సంతోషించి బంగారు నాణాలు బహూకరించాడు. వల్లభుడు అందులో ఒక చిన్న భాగం మాత్రం ఉంచుకుని తక్కిన దంతా దేవాలయాలకి ఇచ్చేశాడు.

విజయనగరంలోని వైష్ణవ ప్రభుతులు వల్లభుడిని తమ గురువుగా ఎన్నుకోవటమే కాక అతనికి 'ఆచార్యు'డనే బిరుదు కూడా ఇచ్చారు...

తర్వాతి 9 సంవత్సరాలలోనూ వల్లభాచార్యుడు భారతదేశం అంతా పర్యటించాడు. చివరికి బృందావనంలో కొంతకాలం స్థిరపడి పోయాడు. బృందావనంలో శ్రీకృష్ణ పరమాత్మ వచ్చి అతన్ని కలుసుకున్నట్లు చెప్పుకుంటారు. ఈ సమయంలోనే భగవంతుడయిన కృష్ణుడు వల్లభాచార్యుడితో బాలకృష్ణ పూజ నెలకొల్పమని చెప్పాడుట. ఇది జరిగిన కొద్దికాలంలోనే వల్లభాచార్యుడు తిరిగి కాశీకి వెళ్ళిపోయాడు. అక్కడ భాగవత పురాణం మీద పెద్ద వ్యాఖ్య రాశాడు. ఇది జగత్ ప్రసిద్ధి పొందింది. నేడు వల్లభాచార్య మత ప్రభావం ఉత్తర భారత దేశంలోనే అధికంగా ఉంది. నేటికీ వల్లభాచార్యుడి పీఠాల అధిపతులు తెలుగు బ్రాహ్మణులే అని చెప్తారు.

—ఎస్.






తాడిగిరి పోతరాజు

### జరిగిన కథ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాథ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాస్టరు, కామయ్య ఆయనకు అప్తమిత్రులు వాగ్దానాని గుర్తుతెచ్చుకుని శారదను ప్రసాద్‌తో వివాహానికి అంగీకరించమంటాడు కామయ్య. శారద బాధపడుతుంది. అంతా గ్రహించేసుకున్న ప్రసాద్ శారదను మధుదగ్గరికి చేర్చడానికి బస్సునెక్కిస్తాడు. తర్వాత అతను ఇలు విడిచి వెళ్ళిపోతాడు. కామయ్య మాస్టారుగా బెంగపెట్టుని చిక్కి శల్యమైపోతాడు. భాస్కర్ భానుమీద శ్రద్ధ చూపిస్తుంటాడు. జీవితంమీద విరక్తిపుట్టి భాను ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకుంటుంది.

## 29

'ఇదుగో అచ్చమ్మగారూ?.. నీ తమ్ముణ్ణంటున్నానని నీకు కోపం రాదుగదా?... ఇదంతా పంతులుగారి ఉసురు తగిలే ఇట్లా అవుతుంది!..పాపం ఆయనదగ్గర అన్యాయంగా వేలకువేలు స్వాహాలుచేశాడు.. గంగిగోవులాంటి వాడు పంతులుగారు...ఆయన్ను 'దొంగ'న్న వాడు నోటిలో పురుగులుపడి సత్తాడు... ఇంకా...ఇంకా అనుభగించాలి నీ తమ్ముడు'...

పాపపుణ్యాలపట్ల తనకున్న విశ్వాసాన్ని, ఆమెఎదుట మొహమాటం లేకుండ ప్రకటించసాగాడు. అచ్చమ్మగారి ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్కలేకుండ కూర్చుండి కోపాన్ని లోలోన దిగమింగుకొని అసహాయంగా కూర్చుంది.

'అదికాదు...శివరామయ్య చేసిన పాపం మూలంగానే గిత్తలు పొయ్యాయను కొందాం ... మరి పంతులుగారి మాటేమిటి?...నాకుతెలియక అడుగుతా...ఆయనే పాపంజేస్తే ఆయన కుటుంబం అట్లా చితికిపోయిందంటావ్' కోటయ్య భార్యఎదురుప్రశ్న వేసింది.

'ఆఁ...అదే...నాకూపాలుబోవటంలేదు... పంతులుగారు సత్తెకాలపు మనిషి...ఆయన బతుకెందుకట్లా తెల్లారిందో మరి?...'

ఆమె ప్రశ్నకు సమాధాన మివ్వలేని కోటయ్య తననుతానే ప్రశ్నించుకొన్నాడు.

ఆమాటలన్నీ దొంగచెవులు పెట్టుకొని వింటూన్న భాస్కర్ నిశ్చల దృష్టితో బజారుకేసి చూశాడు

'వీదిలో పెద్ద కోలాహలం కనిపించింది. చెవులు పగిలేలా డప్పులుకొడుతూ జనం పెద్ద ఊరేగింపులా వస్తున్నారు. నాటి శరీరాలపై పసుపు—కుంకుమ జల్లుతున్నారు. ముందు జోడి గిత్తలపై శివరామయ్య కూర్చున్నాడు.

'ఏం? కోడెలు...శివరామయ్యకు అవే కొడుకులు—పాపం' కోటయ్య అన్నాడు.

ఆ ఊరేగింపు ఇంటిముందుగా దాటిపొయ్యేవరకూ వాళ్ళునల్గురూ మౌనంగా నిలబడి కోడెలను చూశారు. ఆపైన ఎవరి స్థానాల్లో వాళ్ళు చతికిలబడ్డారు.

'ఏంరా భాస్కర్ ... శెలవులకు వచ్చిన వాడివి...మా ఇంటికల్లి తొంగయినా చూడ లేదే'...అచ్చమ్మగారు ఆప్యాయంగా పల్కరించింది.

అతను వినీవిననట్లు, ముభావంగా—అలానే కూర్చున్నాడు.

ఆమె ముక్కాలిపీట అతనికి చేరువగా లాక్కుని—ఏదో రహస్యం మాట్లాడు తున్నట్లు ముఖం పెట్టుకొని గొంతు బాగా తగ్గించుకొని—ముందుకు వంగి అంది.

'మావాడి సంగతి నీకేమైనా తెలిసిందా? ...నీకేమైనా ఉత్తరాలు అవీ రాస్తున్నాడా?...అది కనుక్కుపోదామనే ఎండలో పడివచ్చాను... మొన్న మన ఉత్తరపు వీధి లక్ష్మారెడ్డి వచ్చి 'అచ్చమ్మగారూ ... మన వాడు మద్రాసులో కనిపించాడంటే ప్రాణం లేచి వచ్చిందనుకో...మా అమ్మ బ్రతికుండగా ఆ ఊళ్లో అడుగు పెట్టనన్నాడట.. ఇక చూడ్రా...కన్నతల్లిని...నేనంటే వాడి కంతకోపం...నేనేం చేశ్రా?...,శారదను చేసికొంటానంటే నేను కాదంటానా? ....ఆ......పోయినవాళ్ళు...వాళ్ళు బాగనే ఉన్నారు ... మధ్యలో మాకు చావు...కనుకున్నందుకు మాకు కడుపు తీపి...మీకేంరా? ...బాపురు మంటూన్న లంకంత ఇంట్లో దీపం పెట్టే నాథుడు లేక నేను చస్తున్నా...

ఆమె కంట తడి పెట్టుకొంది.

'శారదను చేసికొంటే నే కాదంటానా? ...అని ఇప్పుడంటున్నావ్.. అప్పు డేమైందీ ఆలోచన... ఊర్మిళను చేసికొమ్మని ఎందుకు బలవంతపెట్టావ్?'...పెద్దా చిన్నా తారతమ్యంలేకుండ విరుచుకు పడ్డాడు— ఆమె తనకు ఆజన్మ శత్రువైనట్లు కొరకొర చూశాడు

భాస్కర్ అనుచిత ప్రవర్తనకు తల్లిదండ్రులిద్దరూ లోలోన నొచ్చుకున్నారు. అతను 'మధు' పక్షం వహించినవాడని ఆమె చిటికెలో గ్రహించింది. లాలనతో కూడిన కోపంతో 'ఒరేయ్...భాస్కర్...మీరందరూ ఇంతేరా?...మా కళ్ళముందు పుట్టి పెరిగినవాళ్ళు...మీకు మా మీద ఇంత కోపాలైతే ఎలారా?...వాడు ఊర్మిళను చేసికోకపోతే దాని పెళ్ళాగిపోయిందా ఏంటి?... రాజాలాటి అల్లుణ్ణి తెచ్చాడు—డాక్టరు చదువు చదివిన కుర్రాడి కిచ్చి చేశాడు...

పోస్ట్‌మన్ సైకిల్ దిగాడు ఇంటి ముందు.

'భాస్కర్ బాబుగారూ...పంతులుగారికి రెండుత్తరాలున్నాయి. పొద్దుటనుండీ ఏం చేద్దామా అని ఆలోచిస్తున్నా...మీ దగ్గరుంచండి' అంటూ వచ్చి భాస్కర్ చేతిలో పెట్టిపొయ్యాడు.

అందరి కళ్ళూ విప్పారాయి. దడదడలాడుతూన్న గుండెలతో ఆశగా చూపులు వాటిపై నిలిపారు — మొదటి ఉత్తరం — తనకు సుపరిచితమైన దస్తూరీ...ప్రసాద్ వ్రేవాలు. గబగబా చింపి చదువసాగాడు.

పూజ్యులైన మాష్టారుకి,

నమస్తే...

తల్లీ తండ్రీ లేని ఈ దీనుడ్ని దయతో పెంచి పెద్ద చేశారు. చివరకు కృతఘ్నుడనై మీ మాటను త్రోసిపుచ్చినందుకు క్షమించండి. 'భానూ' విషయమై మీరు ఎల్లా కృంగిపోతున్నారో నాకు తెలియనిదికాదు. శారదచేసిన పనిని దృష్టిలో పెట్టుకొని — 'భానూ'కి పెళ్ళిచేసి మీ గుండెలమీద భారాన్ని దించుకోవాలని మీరనుకొంటున్నారు. ఆ పిల్ల మీకు భారమేమీకాదు — అదంతా మీరనుకోవటంలో వస్తూన్న లోపమే.

శారదకూ... 'భానూ'కూ ఎంతో తేడా ఉంది.

భానూకు తెలివితేటలున్నాయి—పరిస్థితులు అవగాహన చేసుకొనే సూక్ష్మబుద్ధి ఉంది. మీరు మమ్మలను చదివించినట్లే తనను నేను చదివిస్తాను. యం.ఏ. చదివించుదాం. చదువు పూర్తయ్యాక తనుకోరిన వరుణ్ణి 'శారద'లా నే చేసుకోనిద్దాం—

తను చేసుకోకపోతే అప్పుడు మనం నిర్ణయించుదాం.

డబ్బు మాష్టారూ ? ... డబ్బుంటే ఏపనైనా చెయ్యవచ్చు.

పితృసమానులైన వెంకట్రామయ్యగారు నాకిచ్చిన డబ్బు నేను ఎవరికోసం ఖర్చు పెట్టాలి ... నాకు 'నా' అనే వాళ్ళు ఎవరున్నారు మాష్టారు— మీరుతప్ప...మీరు క్షణికోద్రేకంలో నన్ను వెళ్ళిపొమ్మన్నారు... ఈపాటికి నాపై కోపం తగ్గిపోయిందనుకుంటాను — నేను రెండుమూడు రోజుల్లో వస్తున్నాను.

మీ
ప్రసాద్

భాస్కర్ కళ్ళు చెమర్చాయి — పెదవులు లోనికి వత్తుకున్నాడు.

వాళ్ళు ముగ్గురూ కుతూహలంగా అతని పెదవులపై దృష్టిని నిలిపారు. అతను నిరాశగా ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకొని రెండవ ఉత్తరం చింపి చదవసాగాడు.

నాన్నా!

నా ఉత్తరాన్ని మీరు నిరాదరిస్తారని భయపడి ఇన్నాళ్ళుగా ఉత్తరం వ్రాయలేకపొయ్యాను. ఈవేళ మనసు ఉండబట్టలేక ఇలా సాహసించి వ్రాస్తున్నాను. మీరు నన్నీపాటికి పూర్తిగా మరచిపోయి ఉంటారని 'మధు' అభిప్రాయపడుతున్నాడు. అది అసత్య



మని ఖండితంగా చెప్పాను. మీరు నన్ను మరచిపోరనే విశ్వాసం నాకుంది నాన్నా!... మీరు నన్ను క్షమించి దగ్గరకు తీస్తారనే ఆశతో ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

నేను మీరు క్షమించలేనంత తప్పేమీ చేయలేదనుకొంటా నాన్నా ...... ప్రతి స్త్రీలానే — నేనూ కోరుకొన్న భర్తతో సుఖమయ సంసారజీవితం గడుపుతున్నాను. మీరు నిర్దేశించినట్లు నా జీవితాన్ని రూపొందించుకోలేకపోవటమే నేనుచేసిన తప్పు. ఇది క్షమార్హం కాని అపరాధమైతే క్షమించకండి.

నాపై మీరు ఎన్నో ఆశలు నిలుపుకున్నారు.

పుత్రుడులేని లోటు తీర్చుతానని ఎన్నో కలలు కన్నారు.

అలాటి మిమ్మల్ని ఈ దుస్థితిలో వదిలి పెట్టి ఇలా రావటం నా కిష్టంలేదు — కానీ వేరే గత్యంతరం లేదు — అలా రాకపోతే నేను మీ ఆత్మీయ మిత్రుడైన వెంకటామయ్య గారి కోడల్ని కాకపోయ్యేదాన్ని.

మీ స్నేహితుని కోడలుగా నన్ను చూడటం— మీ కిష్టంలేదా నాన్నా?'

మరొక విషయం మీకు వ్రాయకుండ ఉండలేకపోతున్నాను. మీకొక మనుమడు పుట్టాడు. వాడికిప్పుడు పదినెలలు. చిన్ని చిన్ని మాటలు— బుల్లినోరూ— పోలికలు మాత్రం మీవేనని తను అంటున్నాడు. క్రింది పళ్లు రెండుమాత్రం వచ్చాయి. ఆ పాలపళ్లు రెండూ బయటపెట్టి అప్పుడప్పుడూ ఉత్తి

# మట్టిబొమ్మలు

పుణ్యానికే నవ్వులొలకపోస్తాడు — నిద్రలో కూడ — ఆ రెండు పళ్లతో తాటిస్తూ 'తాత' — 'తాత' — అంటాడు. నీవు మా దగ్గరుంటే ఒక్క క్షణం దించకుండ ఆడించే వాడివి — వాడికి పేరు కూడ పెట్టాం — 'ప్రసాద్' అని నామకరణం చేశాడు తను.

'భాను' ఈ పాటికి యస్. యస్. యల్. సీ—ప్యాసయి కాలేజీలో చేరి ఉంటుందని ఆశిస్తున్నాను. ప్రసాద్ అండదండలతో అన్నీ సవ్యంగా జరిగిపోతున్నాయని ఆశిస్తున్నాను. మీ జాబు కొరకు ఎదురు చూస్తూ—

మీ
పెద్దమ్మాయి.
శారద.

ఆ ఉత్తరం చదువుతున్నంత సేపూ— చిరపరిచితమైన శారద కంఠస్వరం మృదువుగా వినిపించింది అతనికి — తన కళ్ల ముందు నిలబడి తన తమ్ముడితో మాట్లాడుతున్నట్లనిపించింది. ఒక్కొక్క పదమూ ఉత్తరం చదివాడు. ముఖంలో సంతోషం లాస్యం చేసింది — కానీ ఆ చివరి వాక్యాలతో ముఖం ముడుచుకుపోయింది.

'భాస్కర్.. ఎక్కడ్నుంచి వచ్చిందిరా?... ఆ ఉత్తరం' .. ఆతురతను ఆపుకోలేక అచ్చమ్మగారు ప్రశ్నించింది.

'మద్రాసు నుండి శారద వ్రాసింది... వాళ్లకొక అబ్బాయిట...పదినెలలు...ఇంకా నేనంటే కోపం తగ్గలేదాని మాష్టారికి వ్రాసింది.'

'అయ్యో— పాపం...ఈ ఉత్తరం పది రోజులు ముందు రాకూడదూ?' సానుభూతి వ్యక్తపరచింది తన తల్లి.

'అబ్బ...ఎంత చల్లని కబురు చెప్పావురా?... కొడుకటనా! ఒరేయ్ ... రేపే మద్రాసుపోయి వాళ్లను తీసికొద్దాం ... ఎక్కడుంటున్నారో—ఏమిటో, ఇక్కడ వ్రాసి ఉందిగా?... మళ్లీ పెద్దగా చదువు—మేం వింటాం'...

ఆమె ముంచెత్తుతూన్న ఆనందంతో ఉక్కిరి బిక్కిరయి పోయి తల ఆడించుకొంటూ త్వరత్వరగా పలికింది.

'నువ్వు పోవటమే చాలా బాగుంటది అచ్చమ్మగారూ?... మళ్లీ— ఏమీ— మారాము పెట్టకుండ వెంట వచ్చేస్తారు— కొడుకూ— కోడలూ!... మనమడ్ని ఒళ్లో కూకోపెట్టుకొని తీసికురా',... కోటయ్య అన్నాడు.

ఆ మాటతో ఆమె మరింత ఉబ్బితబ్బిబ్బై పోయింది.

'ఇదుగో — కోటయ్యా!... నేను ఏదో అయిన సంబంధమనీ ఆస్తి వస్తుందనీ ఊర్మిళను చెయ్యాలనీ — ఆరాటపడ్డాను కానీ...నిజంగా చెప్పాలంటే—శారద రంగూ — అవీతూ...మా ఊర్మిళ దేనికిపనికినస్తుంది... ఫలానా అచ్చమ్మగారి కోడలంటే ఊళ్లో — మళ్లీ తిరుగుండ కూడదు ... కోడలంటే కోడలా...చక్కని చుక్క'...ఆవేశం పట్టలేక పోయింది.

భాస్కర్ ఆమె అంతర్యాన్ని పసికట్టాడు.

ఆమె మనసును అప్పటివరకూ ఆవహించిన దిగులు మంచులా విడిపోయింది. శారదనోటితో 'అత్తా' అనిపించుకోటానికి తహతహ లాడుతున్నట్లు — మనుమడ్ని ఎత్తుకోవాలని ఉవ్విళ్లూరుతున్నట్లూ తెలిసికొన్నాడు.

'అయితే — భాస్కర్ ... రేపే మన ప్రయాణం— బట్టలవీ సర్దుకో...మరి...నే వస్తాను...' అంటూ ఆమె తిరిగి చూడకుండ నిటారుగా నిలబడి విసవిసా నడిచి వెళ్లిపోయింది.

కామయ్యగారి పరోక్షంలో వారికివచ్చిన ఆరెండు ఉత్తరాలనూ పట్టుకొని వారింటికేసి నడిచాడు భాస్కర్.

* * *



మాష్టారి ఇల్లు వంచపాళివైపు కూలి పోతోంది.

ఆ కిటికీల పైన — దూలాల పైన కాకి రెట్టలు—పిచ్చుక పెంటలు తెల్లగా ఎండి పోయ్యాయి. ఇల్లంతా దుమ్ముతో నిండి పోయింది. వసారాలో మాష్టారు ఏర్పరచిన వారి ప్రియతమ నాయకుల ఫోటోలు నల్ల కాపురుపట్టి పోయ్యాయి. అద్దాల లోపలి వైపున్న చిత్రాలను సగభాగం చిమటలు తిన్నాయి. వాటిపైన సాలిగూళ్ళు—బూజు విరివిగా అల్లుకున్నాయి.

మాష్టారు కూర్చునే మడతకుర్చీ తల ఆన్చుకొనేస్థలంలో నూనెతో నల్లగా అసహ్యంగా ఉంది. కూర్చునే స్థలంలో అడ్డంగా చిరిగిపోయింది. దాని చేతిమీద తొరగిలా

# మట్టి బొమ్మలు

పెట్టెఉంది—పుస్తకం.

ఆ పుస్తకాన్ని చేతుల్లోకి తీసికొన్నాడు—అది 'గీతాంజలి'—

'ఉఫ్' అని దుమ్ముదులిపి ఆపేజీ చదివాడు- 'లీడ్ కయిన్‌డ్‌లీత్ లైట్—' ఆగీతం వారికెంతో ఇష్టం- తరచు శారదకానీ—ప్రసాద్‌కానీ చదువుతోంటే, ఆవాలుకుర్చీలో కళ్ళు మూసికొని వింటూండేవారు. ఆగీతం జోలపాటలావింటూ నిద్రించేవారు

ఆపేజీ అలానే తెరచి బోరగిలా పెట్టాడు—

టేబిల్‌పై పుస్తకాలు చెల్లాచెదరుగా పడిఉన్నాయి వాటిచెంతనే పగిలిన అద్దం—'భాను' దానిని నారింజరంగు రిబ్బను ముక్కతో కట్టింది.

ఆమూలనే మాష్టారు ఉత్తరాలన్నీ గుచ్చుకొనే తీగెఉంది. కార్డులూ కవర్లూ రసీదులూ ఏవేవో మాసిపోయి అసహ్యంగా వేలాడబడుతున్నాయి.

ఆ ఉత్తరాలను దావికి గుచ్చాడు.

సజల నేత్రాలతో ఇల్లంతా కలయజూశాడు.

కళకళ లాడుతూ - నవ్వులతో— మాటలతో నిండుగా ఉండే ఇల్లు బావురుమంటోంది. వంటగదివైపు అటూ ఇటూ జిల్లేళ్ళు—ఉమ్మెత్తలూ మొలుస్తున్నాయి. ఆమూలన ఉత్తరేణి మొక్కల పక్కగా—చెత్తాచెదారంలో నుండి పగిలినగాజు పెంకులు తొంగి చూస్తున్నాయి!

చూపుప్రక్కకు తిప్పుకున్నాడు.

ఆ కిటికీలో మట్టిబొమ్మ లున్నాయి.

ఒకప్పుడు జీవకళ ఉట్టిపడుతూన్న బొమ్మలు— ఇప్పుడు రంగుపోయి—చేతులు విరిగి—నిర్జీవంగా—చెల్లా చెదరుగా పడి ఉన్నాయి.

ప్రేమ — అనురాగం — సానుభూతి—స్వార్థం—దుఃఖం—దురాశ—ఎన్నో మానసిక ప్రవృత్తుల సంఘర్షణతో కొట్టుమిట్టాడి జీవితనాటకంలో విషాదంగా నిష్క్రమించిన మట్టిబొమ్మలు.

చేతులు విరిగి వెల్లకిలా క్రిందబడిన ఆ బొమ్మ—వికృతమైన బొజ్జతో— చెవుల వరకూ సాగదీసిన నోటితో పగలబడి నవ్వుతోంది

అనవ్వుకు అంతంలేదు—ఆ రాకుమారుని బొమ్మ ముక్కలు ముక్కలుగా పగిలి పోయింది.

'సత్యాని'కి ముళ్ళకిరీటం కొట్టాడు.

'సమత'కు గుండెల్లో తుపాకులు పేల్చాడు.

'ఆ ధర్మం'—'కాలం' లా అనంతంగా సాగుతోంది' !

ఎన్నో స్మృతులు అతని చుట్టూ పరిభ్రమించాయి. ఎందరివో నీడలు తన చుట్టూ వ్యాపించి ఆ చీకటి గదుల్లో లీనమైపొయ్యాయి. ఇల్లంతా—చిరిగి మాసిపోయిన గుడ్డలతో, జీర్ణావస్థలో ఉన్న వస్తువులతో, పాతవాసన కొడుతోంది. ఆ ఇంట్లో దీపం పెట్టటానికి కూడ ఎవరూ లేరు.

మనసు వికలమైపోయి మెల్లగా బయటికి నడిచాడు.

వీధిలో దీపస్థంభం ఒరిగి పోయింది.

దాని ప్రక్క నిశ్చలంగా ఉన్న మురుగు కాలువలో మాష్టారి చేతికర్ర వెకిలిగా తొంగి చూస్తోంది. నిర్జన ప్రదేశాన్ని వెతుక్కుంటూ అతను పెద్ద పెద్ద అంగలతో ఊరుబయటికి నడిచాడు.

ఊరిబయట నల్లని కొండ.

ఎత్తైన పెనుబండలు నల్లగా మొండిగా ఒకదానితో మరొకటి పెనవేసి కొన్నాయి. అక్కడకు చేరి విశాలమైన ఒక బండపై చతికిల బడ్డాడు.

ఎదురుగా మామిడితోపు.

మదించి విజృంభిస్తూన్న ఆ చెట్ల నీడలలో ప్రక్కలలో అణిగి మణిగి ఉన్న చిన్నచిన్న చెట్లు—లతలు—తీగెలు—వెలుగు చూడనోచుకోలేక వెల వెల లాడుతూ రాలి పోతున్నాయి! ఆ పాదలలో నుండి పడి మొలిచిన పూలమొక్క ఒకటి ఎవరికీ కనిపించకుండ వాసనలు విరజిమ్ముతోంది.

మామిడి చెట్ల ఆవల దివాకరుడు అస్తమిస్తున్నాడు.

ఆ అస్తమయ కాంతుల్లో పొలాలూ—ఇళ్ళూ సమస్తమూ కాంతి విహీనమైపోతున్నాయి. నల్లని కాటుక పిట్టలు బండల మాటున ఎగురుతున్నాయి. తన తలమీదుగా రెక్కలు కొట్టుకొంటూ పక్షి ఎగిరి పోయింది.

అతను ఉలిక్కి పడ్డాడు.

వెంటనే ఉన్న గోతిలో రాబందు వాలింది.

'క్కడ ఎన్నో రాబందులు గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. ముక్కులు పొగ బెట్టి రెక్కలు కొట్టుకుంటూ ఎద్దు అస్థిపంజరాన్ని పీక్కుతింటున్నాయి. ఎర్రని

## మట్టి బొమ్మలు

పచ్చిమాంసంతోనున్న ఎముకల పోగు, చుట్టూ జీర్ణావస్థలో నున్న కళేబరాలు—



ఇలకరచుకపోయిన పళ్ళనరసతో లొత్తలు పడ్డ కళ్ళతో మొండెంనుండి విడియిపోన తలలు ఇకిలిస్తున్నాయి.

ఒళ్ళు గగుర్పొడిచింది.

వాటి చెంతనే సజీవమైన ఎద్దు పడి ఉంది. అనాలోచితంగా లేచి అటు నడిచాడు.

జీవిత మంతా దుక్కి—దున్ని—బక్క చిక్కిన వృషభరాజం.

దాని నాలుగుకాళ్ళూ కట్టి మూటలా అ గోతిలోపడ వేసి ఉంది.

మెడ ప్రక్కకు వాల్చి నిస్సహాయంగా మృత్యువును నిరీక్షిస్తోంది. కాకి ఒకటి దాని పొడుగాటికొమ్ముపై కూర్చొని కంటిపై పొడుస్తోంది. ఆ బాధకు తాళలేక—విసురుకోను శక్తిలేక రెప్పలారుస్తోంది. కాకి ఎగిరిపోయింది. జాలిగా ప్రేమగా భాస్కర్ దాని తలను ఎత్తిపట్టి సరిగా పెట్టాడు.

కాంతిలేని దానిగాజు కళ్లనుండి బొట్లు బొట్లుగా కన్నీరు రాలింది.

మళ్లీ మెడప్రక్కకు వాలిపోయింది.

రేపీపాటికి, దానిచర్మం ఒలిచి కళేబరాన్ని రాబందులకు, కుక్కలకు ఒదిలి పెడతారు.

జీవితమంతా తన రక్త మాంసాలను మానవ సౌఖ్యం కోసమై వెచ్చించిన నోరులేని పశువు. శక్తులుడిగి పోయిన అంత్య దశలో కృతఘ్నుడైన మానవుడు దానికి చేస్తున్న న్యాయం ఇది.

మెల్ల మెల్లగా ఆకాశాన నీడలు, చీకట్లు అలుము కొంటున్నాయి.

—రవిరాజు అస్తమించాడు.

—ఊరంతా మాటు మణిగింది.

(అయిపోయింది)

అంకితం:

అన్యాయం పడగవిప్పినపుడు
అధర్మం నగ్నంగా నర్తించినపుడు
ఎదిరించే శక్తిలేక
ఎదలోని అశ్రువులను
చాటుగా తుడుచుకొనే
సున్నిత హృదయులైన మానవులకు—
ఏ దేవుడికీ కాదు.

—రచయిత ●




(గత సంచిక తరువాయి)

రామూర్తి వేదిక యెక్కాడు.

'యీ ఆడాళ్ళ ముఠా సమావేశాల్ని ఆపుచేయడం మన తక్షణ లక్ష్యం. కాబట్టి వాళ్ళు సమావేశాలు పెట్టుకున్నవేళల్లో, యింట్లోనేఉండి వాళ్ళు బయటికిరాకుండా అడ్డుపడాలి. అప్పుడింక యేగోలా ఉండదు!'

ఐడియా చాలాబాగుందని అంతా అంగీకరించారు. అయితే, వాళ్ళ మళ్ళీ సమావేశమెప్పుడో, యెన్నాళ్ళకో! అసలది బహిరంగ సమావేశమో, అంతరంగిక సమావేశమో సాధారణ సభో, కార్యవర్గ సమావేశమో తెలిసేదెలా?

'అసలు, యివాళ్టి సమావేశానికి మనలో ఒకరు ప్రతినిధిగానో, గూఢచారిగానో అక్కడుండాల్సింది!'

'వెంకట్రావుగార్ని ఉండమని శ్రీమతి ఉషారాణి పట్టుబడ్తే కాదని వచ్చేశారు!' అన్నాడు సుబ్బారావు. వెంకట్రావు అందరి వంకా గర్వంగా చూశాడు.

'మిమ్మల్ని ఉండమంటే మీరు వచ్చేశారా?' రాజశేఖరావు గట్టిగా నవ్వసాగాడు.

'యెందుకు నవ్వుతారు?'

'యేమనుకోకండి, శ్రీమతి ఉషారాణీ నేను ఆరేళ్ళు కలిసి చదువుకున్నాం. అవిడ సాటివాళ్లతో చదరంగం ఆడుకుంటారని పేరు! మీ రక్కడుండడం యిష్టంలేకే, నిజం చెప్తే మీ రక్కడే ఉంటారన్న అనుమానంతో, ఉండమనుంటారు, వెళ్తారని!'

అంతా గొల్లుమన్నారు. వెంకట్రావూ నిజమే గాబోలనుకున్నాడు.

'వెంకట్రావుగారూ! యిప్పుడింకా మూడుగ లేదు. తిన్నగా యింటికి వెళ్ళండి. సినిమా చూసివచ్చినట్లు నటించండి. యింట్లోనే ఉండి మనక్కావల్సిన విషయాలన్నీ సేకరించండి!' అంతా బతిమలాడి వెంకట్రావుని యింటికి పంపించారు.

అసలు నిజంగా సినిమా చూసి వచ్చి వెట్టే బద్ధకంగా ఉంది వెంకట్రావుకి. యింటికివెళ్ళి విశ్రమించాలి. బయల్దేరాడు.

వెంకట్రావుని చూడగానే రాణి ఆశ్చర్యపోయింది. కాని వెంటనే ఆశ్చర్యాన్ని నవ్వుతో కప్పేసి, 'యేం, ఉన్నట్టుండి నా మీద యింత దయగల్గింది?' అంది.

'యేదో పాపం అడిగావని, వచ్చిందాకా మనసూరుకోలేదు!' అంటూనే లోపలికి నడిచాడు.

డ్రాయింగ్ రూం, లివింగు రూం మధ్య పార్టిషన్ తీసేసి కార్పెట్ పావిడంతా పరిచేసింది. గోడల్నున్న ఫొటోలు, దృశ్యాలు, శిల్పాలు అన్నీ తీసేసి ఆనవాలు లేకుండా తుడిచేసింది. గుమ్మాలకీ, కిటికీలకీ కొత్త తెరలు గట్టింది. ఓమూల రేడియోగ్రాం మీద ఫ్లవర్‌వాజ్, ఒక చిన్న టీపాయ్ తప్పించి యింకేం లేవు.

'అక్కడ మా తాతగారిదీ, మామ్మదీ ఫొటో తీసెయ్యడానికి నీ కెవడిచ్చాడు హక్కు?' మండిపడ్డాడు.

'ఒక్కపూట ఆ ఫోటో అక్కడ లేక పోతే విూ పితామహా, మాతామహా భక్తికి భంగం రాదులెండి!' అంత హెచ్చు స్వరం లోనూ జవాబిచ్చింది.

'నాన్సెన్స్!'

'అదుగో నాన్సెన్స్ మళ్లీ మొదలు!'

'యిదుగో, అమ్మాయి, మగాడు మొగుడు అన్న గౌరవమన్నా లేకుండా అలా మాటకి మాట అప్పజెప్పేస్తావా? యీ వాచాలత్వం యింకానా? యికపై సాగదు!'

'మీరు బుజాలు తడుముకోడం బాగుంది! మీ రన్నది నాన్సెన్సులేదు, నే నన్నదల్లా నాన్సెన్సని మీరు కొట్టిపారేయడం మొద లైందన్నాను, అంతే!'

'అదే, నీ ద్వంద్వార్థాలు, వ్యంగ్యార్థాలు, అన్నీ ఒక్కటొక్కటే అర్థమవౌతున్నాయి. వీటన్నిటికి ఫుల్‌స్టాప్ పెట్టించేసే శుభ ఘడియ లొస్తున్నాయి! తూర్పుదిశ యెర్ర బారుతోంది! రథచక్రాలొస్తున్నాయి, జాగ్రత్త!'

'ఒస్తున్నాయా? ఒస్తుంటే అలా వీధి గదిలో గెస్టు రూంలో కూర్చొని రిసీవ్ చేసుకోండి!' పరధ్యానంగా అంటున్నట్టు టీపాయ్‌మీద గుడ్డ సవరిస్తూ అంది.

వెంకట్రావు పట్టించుకోనట్టు గదిలోకి వెళ్లి నిద్రపోబోయాడు. ఓ కునుకు పట్టిందో లేదో –

యిల్లు కాస్తా తిర్నాళ్లయింది.

మూడు గంటల్నుంచి కార్లు, టాక్సీలు, ఆటోరిక్షాలు, యిరుకు రిక్షాలు లాంటి వాహనాలమీదా, కాలినడకని ఆ చుట్టుపట్ల యావన్మంది స్త్రీజనం యింట్లోకి దిగబడి పోతుంటే వెంకట్రావు బేజారైపోయాడు. సోడాబుడ్లు, మిఠాయికొట్లు, ఛాట్ షాప్స్ తీసేస్తే ఓ పెద్ద సైజు సంతకీ, యీ సమావేశానికి తేడా యేంలేదు.

ఉదయాన్నే రాణి జారీచేసిన వార్నింగు ఆర్డర్‌కి అర్థం యీ కుంభమేళా అనుకో లేకపోయాడు వెంకట్రావు.

నిజం పిడుగులాగ మీదపడగానే యింక వెంకట్రావుకేం చెయ్యాలో తోచిందికాదు. బయటికి పోదాం అనుకున్నాడుగాని పాన్ షెట్‌డాంకి బ్రీచ్ పడ్డట్టు గేటు తెరుచుకు వచ్చిపడ్తున్న వనితావాహినికి యెదురీదడం యెలాగ? పైగా లోపలికివెళ్లి కాస్త మొగ మయినా కడగ వీల్లేకుండా దిగ్బంధం అయి పోయింది. బట్టల అల్మెరా యేమూలకి వెళ్లేసిందో, యెక్కడ సర్దిందో! యిక ఆ గందరగోళంలో బట్టలకోసం వెతకడ మంటే యే మహాసముద్రంలోనో కాకి రెట్ట కోసం వెతికినట్టు!

వెంకట్రావు దిగాలుపడి కుర్చీలో కూల బడ్డాడు. హాలునిండా యేమిటో గోలగా ఉంది, పది రైళ్లు ఒక్కసారి ఆగినట్టు, పది సినిమాలు ఒక్కసారి వదిలినట్టు!

సీత, రమ, ఉమ, రాధ, వాణి, లక్ష్మి, సుశీల, సుమతి, కౌముది, రమణ, విజయ, నిర్మల, లలిత, జానకి, జమున, సావిత్రి, జ్ఞానాంబ, దుర్గాంబ, ప్రసూనాంబ, శేషు బాయి, వెంకమాంబ, దుర్గాబాయి, కృష్ణా బాయి, కామేశ్వరి, రాజేశ్వరి, హైమవతి, సరస్వతి, గోగులమ్మ, వరదమ్మ, సల్మా, రజియా, రెహానా, గ్లోరీ, రోజ్, విల్మా, మేరీ, పరమేశ్వరి, రాజరాజేశ్వరి, మందార మాల, పూర్ణకనక కుంభతిలక, వేంకట సీతారామ కృష్ణాంజనేయ వరదసుబ్రహ్మణ్య ముకుందలక్ష్మి, వగైరా పేర్లుగల వాళ్ళంతా హాలునిండా పశ్చిమ బెంగాల్ అసెంబ్లీలో గ్రూపుల్లోలాగ యెవరికివారే విడివిడిగా తలో మూలా అక్షరాలు రానివాడు పలకనిండా సున్నాలు చుట్టినట్టు కూలబడ్డారు.

'మీ వారు మళ్లా క్రొత్త కారు కొన్నార్టగా!'

'మీ యింట్లో యివాళ కూరేం వండారు?'

'ఐ నెవర్ సీ డర్టీ తెలుగూ పిక్చర్స్!'

'మేం వచ్చే సమ్మర్లో కొడై వెళ్దామను కుంటున్నాం'

రేపు మధ్యాహ్నం ఒంటిగంటకి రేడియో పాకిస్తాన్‌లో ఫర్మాయిష్, మెహదీహసన్ చదువుతాట్ట!'

'శాండ్ పైపర్' చూశారా మీరు!'

'సెండ్‌మీ నో ఫ్లవర్స్' చాలా బాగుం టుంది!'

'అసలు యిజ్రాయిల్ వాళ్లదేం తప్పు లేదుట, అంతా అరబ్బులదే అని చెప్పారు, మావారు!'

'మెట్రిక్యులేషన్ పాసయిందో లేదో దాని కెంత తల బిరుసు! ఆ బర్మా ముడులు, ఆ ఒళ్లంతా కనబడే బట్టలు, సింగు సింగు మంటూ నడక!...'

'ఆడవాళ్లంతా కలిసి సినిమా తీస్తు న్నార్ట!'

'నిన్న మీరు అలా ఒంటరిగా యెక్క డికో పోతున్నారు? నేను డబుల్ డెక్కర్ మీద మావారితో వెళ్తూ చూశాన్లెండి!'

'కల్పతరు అని చెప్పుకోడానికేగాని అక్కడ అదాచేసిన డబ్బులకి. రెండురెట్లు రిక్షాలకి, బస్సులకి తగలడి పోతున్నాయి!'

'మావారు మిన్నియాపొలిస్ నుంచి ఆదివారంనాడు దిగుతారు; వారిని రిసీవ్ చేసుకోడానికి డండం వెళ్లాలి!'

'వెంకట్రావమ్మ యెక్కడికీరాదు; అక్క డికి ఆవిడ మొగుడొక్కడే పెద్ద ఉద్యో గస్థుడన్నట్టు యెక్కడ లేని టెక్కు!'

... ... ... ...

యెవరు యెవరో మాట్లాడుతున్నారో, యెవరు వినిపించుకుంటున్నారో తెలియ కుండా యీ మాటలన్నీ పెద్ద తీర్థంలో టేప్‌రికార్డ్ చేసిన శబ్దాల్లా వినవస్తు న్నాయి. మధ్యలో పిల్లల కేకలు, అరుపులు, ఏడుపులు, పరుగులు, మందలింపులు!

'సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం..'

'అన్నట్టు అడగడం మర్చిపోయా, యింకా కాస్సేపుంటే, అసలే మర్చిపోతానేమో, మీ అమ్మాయికేదో సంబంధం కుదిరిందన్నారు, ఏమయిందేమిటి?'

'మా తమ్ముణ్ణి టెక్‌సెల్ వాళ్ళు ఆర్నెళ్లపాటు తిరగడానికి అమెరికా పంపి స్తున్నారు;'

'గేదెల్నెలా తోలుకోవాలో, అక్కడెలా కాస్తారో చూసిరావడానికట గదూ!'

'అన్నట్టు, యెవరి దగ్గిరా అనకండి సుమా! సుబ్బరామమ్మ కొడుకు ఢిల్లీలో యెవత్తెనో ఉంచుకున్నాట్ట! యెన్ని సంబం ధాలు వచ్చినా తిరగ్గొట్టేస్తున్నాట్ట అందుకే!'

'సోదరీమణులారా,

ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉండమని మనవి! యిప్పుడు మన అధ్యక్షురాలు ప్రసంగిస్తారు...'

'సోదరీమణులారా,

నాకసలిలాంటి తతంగాలన్నీ క్రొత్త...'

'శఠగోపంగారు వ్రాసిన కథ పడింది చూశావా! చాలా బాగుంది. ఆయన కథ లంటే నాకెంతో యిష్టం.'

'ఆయన రాసేవన్నీ ఉత్త కాపీలుట! యింగ్లీషువాళ్లకో, యిటలీవాళ్లకో?

అందుకే ఆయనవెప్పుడూ చదువను నేను !'

'మీరీ కొత్త 'వేవ్' యెప్పుడు పెట్టించుకున్నారు? యెక్కడ?'

'మీకు చింతలపూడి ట్రాన్స్‌ఫరవుతుం దంటున్నారు! నిజమేనా?'

'మొన్న రేడియోలో నాటకం వచ్చింది, విన్నారా? యెప్పుడోగాని అట్లాంటివి రావు!'

'పూర్ణకుంభ తిలక పేరుతో పడే కథ లేవీ ఆవిడ వ్రాసినవిగావట! యెవడో స్నేహితుట్ట! అతగాడు వ్రాస్తే యీవిడ పేరెట్టి వేయించుకుంటుందిట.'

'ఈనాడు స్త్రీలముందు యెన్నో సమస్యలున్నాయి. ఇదివరకులాగ పురుషుడికి నీడలా వ్యక్తిత్వంలేకుండా, స్వాభిప్రాయాలు, స్వాభిమానం లేకుండా సంఘానికి, సమాజానికి జడిసి, స్వార్థపరులు నీతినియమాల పేరిట, పుక్కిట పురాణాల పేరిట చుట్టూ అల్లిన పాతగూడుకే అంకితమై అన్నిటికీ తలూపే డూడూ బసవన్నకాదు, యీనాడు స్త్రీ. ఈ సత్యాన్ని పురుషలోకం యెంత త్వరగా గుర్తిస్తే అంతమంచిది. గుర్తించని నాడు, మిన్నువిరిగి మీదపడితే 'అప్పుడే మేల్కొంటారువారు. అంతవరకు మనం...'

'యీవిడ కెవరోగాని మా బాగా వ్రాసి చ్చారమ్మోయ్, ఉపన్యాసం!'

'ఊరుకోరా. దిక్కుమాలిన వెధవా! యిలా యేడ్చేవాడివి మీనాన్న దగ్గిరే దిగడ లేక పోయావా?'

'కి' మంటూ యెవరో చంటిపిల్ల యేడుపు.

అమ్మవారి సంబరాన్ని మించిపోయింది హాలు. వీళ్ళీ జాతర తగ్గించి అసలు తీర్మానం యెప్పుడు పాస్ చేస్తారో, యెప్పుడు తిరిగి సమావేశం నిర్ణయిస్తారో వెంకట్రావుకేం అంతుబట్టలేదు.

'యిదుగో, కాస్త యీ పాపని పట్టుకోండి! వాళ్ళమ్మ యేం మాట్లాడకుండా ఉత్తినే యేడుస్తోంది. కాస్త అలా దూరంగా తీసుకెళ్ళి ఆడించండి.'

'అడ్డమైన ఊర్లోవాళ్ళ, అందులోనూ పనిలేనివాళ్ల పిల్లల్నీ యెత్తుకు ఆడించడానికి, వాళ్ళని చూసి నవ్వు పులుముకోడానికి జవాహర్లాల్ నెహ్రూ వారసుణ్ణను కున్నావా?'

కాని ఉషారాణి వెంకట్రావు మాటలకి

# ఘెరావ్

ముందే మాయమైంది.

పిల్లకేసి గుడ్లురిమేట్టు చూశాడు. బొద్దుగా, చింపిరి జుట్టుతో అడ్వర్టయిజ్‌మెంట్ పాపాయిలా వుంది. వెంకట్రావుని చూడగానే పాపకి నవ్వొచ్చింది. 'నాన్న!' అంది.

వెంకట్రావు ఉలిక్కిపడ్డాడు. మళ్ళా 'నాన్న!' అంది గట్టిగా, కీచుగా సందేహం లేదన్నట్టు. చేతులు చాచింది. అనుకోకుండానే వెంకట్రావూ చేతులు చాచాడు. చంకనెక్కింది. వెంకట్రావు బుగ్గని మూతి అంటించింది ముద్దెట్టుకుంటున్నట్టు. ముందుకి వంగింది. అనుకోకుండానే రెండో బుగ్గ అందిచ్చాడు వెంకట్రావు తల త్రిప్పి. అక్కడా యింకోటి అంటించింది. నుదుటికి నుదురు ఆన్చి, కళ్లలోకి చూసింది. చెంపల్ని బుల్లి బుల్లి అరచేతుత్తో రాసి గడ్డాన్ని తడిమింది. యింతలో...బనీన్లోంచి చల్లగా తగిలింది. తడిమి చూసుకున్నాడు వెంకట్రావు! పైజమా మీంచి తడుపు కుంటూ ధారలా క్రిందికి కారుతోంది.

వెంకట్రావుకి దిగ్భ్రమ కలిగింది. వొళ్ళు మండింది. పాపని క్రిందకూలేసి బుగ్గలు మెలేశాడు. కెవ్వుమంది. మళ్ళీ రాగం మొదలు. పైజమావిప్పి టర్కీటవల్లోకి మారాడు వెంకట్రావు.

'కాస్త ఆడించమంటే, అలా యేడిపిస్తారేమిటి? ఆమాత్రం చేతగాదూ!' అని గబగబా డైలాగు చెప్పేసి వెళ్ళిపోయింది ఉషారాణి.

'ఆర్డర్! ఆర్డర్!' అరిచాడు వెంకట్రావు.

పాప యెంతమాత్రం వినిపించుకోలేదు.

'షటప్' గదిమాడు.

తనకేం లెక్కలేదన్నట్టు చూసింది పాపాయి. రాగం అంతకంతకీ హెచ్చుతోంది గాని తగ్గుముఖం పట్టడంలేదు. వెంకట్రావు హోహో అన్నాడు, హీహీ అన్నాడు. పళ్ళు చూపెట్టాడు, నాలుక బయట పెట్టాడు, కళ్ళు పెద్దవిచేశాడు. గది చుట్టూ పరుగెత్తాడు. కోతిలాగ, పక్షిలాగ యింకా రకరకాల స్వరాలు వినిపించాడు. కప్పలాగ నటించి చూశాడు. లాభంలేదు. చివరికి యేదో సినిమా పోస్టర్లో చూసింది

గుర్తుకొచ్చి గుర్రమయ్యాడు. పాప వీపెక్కింది. కళ్లెం క్రింద వెంకట్రావు జుట్టు నుపయోగించుకొని గటంలా స్వారీ చేసింది.

యీలోపల యెప్పుడు సమావేశం ముగిసిందో వెంకట్రావు గమనించలేదు. మళ్ళీ ఓవంద సర్కసులు ఒక్కసారిగా ఒక్క చోటనే వదిలేసినంత గోల మొదలైంది. 'హమ్మయ్య' అనుకున్నాడు వెంకట్రావు.

ఇంతకీ వాళ్ళ తీర్మాన మేమిటో, మళ్ళా యెప్పుడు కలుసుకోవాల్సనుకున్నారో తెలుసుకోడానికి అవకాశమే రాలేదు.

'అంతా నీ మూలాన్నే! నా పనంతా పాడు జేసి వదిలావు!' పాపని క్రింద కూలేసి గుడ్లురిమాడు.

'పాపనవ్వింది, మా బాగా అయిందన్నట్టు. వెంకట్రావుకి ఒళ్ళుమండి ఒక్కటంటించాడు, మెల్లగా. కెవ్వుమంది మళ్ళీ.

యింతలో ఉషారాణి, రాధ వచ్చారు.

'మీకు నా... మ యిచ్చాను. బది బొత్తిగా హద్దూపద్దూ లేకుండా అల్లరి చేస్తుంది. వాళ్ళ నాన్న దాన్నలా నెత్తికెక్కించుకొని బొత్తిగా అల్లరి, పెంకితనం మప్పేశాగు!' అనబోతున్న రాధ వెంకట్రావు ఆకారం చూసి సిగ్గుపడి, తలవంచుకొని, పాప నెత్తుకు, 'వస్తా' అని రాణితో చెప్పి గబగబ వెళ్ళిపోయింది.

రాణి విరగబడి నవ్వసాగింది. వెంకట్రావు అమ్మవారు పూసిన వాడిలా జుట్టంతా రేగి, పాప కొరుకక, బొట్టు అన్నీ మొగంనిండా పులుముకొని, ఒంటిని టర్కీటవలు తప్ప యింకేం లేక, వెంట్రుకల నిండా దుమ్ము చరుముకుపోయి చూడ ముచ్చటగా ఉన్నాడు.

ఆ రాత్రి రాణి వంక చూడలేదు, రాణితో మాట్లాడలేదు వెంకట్రావు. ఆ రాత్రి కాదు. చాలాకాలం మభావంగానే జరిగిపోయింది;

ఉన్నట్టుండి, రామశాస్త్రి ఫోన్ చేశాడు, పదిరోజుల తర్వాత.

'వెంకట్రావుగారూ! యివాళ మన నిర్ణయం అమలు పర్చాల్సిన రోజు. యివాళే ఘెరావ్!'

'యెవరు చెప్పారు యివాళే సమావేశమని!'

'కృష్ణమూర్తి. అతని కివాంటివన్నీ తెలుస్తూంటాయి.'

'సరే. అందరికీ తెలుసా, యీ విషయం?'

# ఫెరాప్

'అందరోత్తనూ చెపుతున్నాను. మీరూ మీ క్కనబడ్డ వాళ్లందరోత్తనూ చెప్పండి.'

'అలాగే.'

వెంకట్రావుకి మంచి ఉత్సాహంగా ఉంది. సాయంకాలం యెప్పుడవుతుందా అని యెదురు చూశాడు. చివరికో యుగం గడిచిపోయాక ఆసాయంకాలం వచ్చింది. యింటికి రాగానే, రోజూలా బద్ధకించకుండా, వెంటనే స్నానం అదీ కానిచ్చి, సిల్కులాల్చీ, పైజమా ధరించి డ్రాయింగు రూంలోంచి బయటి కొచ్చే గుమ్మంలో పేంకుర్చీ లాక్కొని ఆరోజు పేపరు చదవడం మొదలెట్టాడు. మిగతా తలుపులన్నీ మూసిఉన్నాయి. సరిగ్గా ఆరుగంటలకి సమావేశం.

యింక పదినిమిషాలుండగా తయారయి వచ్చింది ఉషారాణి. చేతిలో హేండ్‌బాగ్ ఉంది. చేతికి వాచిపెట్టింది. రెండుజడలు వేసింది. డ్రాన్‌చీర కట్టింది. పెళ్లయిన రెండేళ్లలోనూ అంత అందంగా చూసింది ఏరెండుసార్లో, మూడుసార్లో! అయినా ఆ మెవంక చూడ్డంలేదు వెంకట్రావు. పేపరు ఆమూలనుంచి యీమూలకి అడ్డపడి చదివేస్తున్నాడు.

'యివ్వాళ క్లబ్ కెళ్లడంలేదేమిటి?'

'లేదు.'

'ఏం?'

'నీకు సంజాయిషీ యిచ్చుకోవాలా?'

'నాకేం సంజాయిషీ అక్కర్లేదు. ఊరికే అడిగాను. చెప్పాలని లేకపోతే మానేయండి.'

కాసేపు మాటల్లేవు.

'అదేం, అలా గుమ్మానికి అడ్డంగా కూర్చున్నారు. యింత గదుండగా!'

'నాయిష్టం!'

'అదే, యివాళ కొత్తగా యీ యిష్టం అయిందేం అని?'

'నాకు సమాధానం చెప్పాలని లేదు!'

'యివేమిటివాళ, సమాధానాలు చెప్ప కూడదని వ్రతమేమన్నా పట్టారా?' ఉషారాణి నవ్వింది. వెంకట్రావు నవ్వకుండా పేపరు చదువుకున్నాడు.

'కాస్త అలా అడ్డుతప్పుకోండి; బయటికెళ్లి యిప్పుడేవస్తాను!'

'నువ్వెక్కడికీ వెళ్లడానికి వీల్లేదు!'

'అదేం?'

'అదంతే. నాయిష్టం!'

'యిలాంటి యిష్టాలు యెప్పట్నుంచి నేర్చుకున్నారు? యివాళ మా కార్యవర్గ సమావేశం. నేను కార్యదర్శిని. అందర్నీ పిల్చింది నేను. నేనే వెళ్లకపోతే యెలా?'

'ఫోనెత్తి యెవర్నీ రావొద్దని చెప్పెయ్యి.'

'యివాళ మేం. చాలా ముఖ్యమైన విషయాలు మాట్లాడుకోవాలి!'

'నాన్సెన్స్!'

'యిదుగో యిలా నాన్సెన్సూ గోనెసంచీ అని నన్నంటే అన్నారుగాని మమ్మల్నందర్నీ కలిపి అనకండి! నాక్కోపం వస్తుంది.'

'వస్తేరానీ! యెవడికి బెదిరింపు?'

కాసేపు నిశ్శబ్దం.

'యేమిటసలు యిలా ఉన్నారు? యివాళ ఆఫీసులో ఏమైనా అయిందా?' వెంకట్రావు మాట్లాడలేదు.

'పోనీ, మీటింగుకి వెళ్లన్లెండి. ఉత్తినే అలా బజారుకెళ్లి యింట్లో కేమన్నా తీసుకొస్తాను.'

'వీల్లేదు.'

'మరయితే యేమిటి వీలుంటుందో చెప్పండి; యింతా తయ్యారయ్యాక యెక్కడికీ వెళ్లకపోతే తోచదు. పోనీ, సినిమాకి వెళ్దామా, లేకపోతే మీ క్రొత్త స్నేహితులెవరో ఫేమిలీ తెచ్చుకున్నారుగా! కాల్ అన్‌చేసి వద్దామా?'

వెంకట్రావు కొద్దిగా చలించాడు. దీనికి వీల్లేదనడం యెలా?

'నాకు వెళ్లాలని లేదు!'

'యేం?'

'అదంతే.'

ఉషారాణి కొంచెంసేపు మాట్లాడలేదు. వెంకట్రావులో విజయ గర్వం ఆవహిస్తోంది.

'పెళ్లయిన కొత్తల్లో, మనం యిద్దరం స్నేహితుల్లాంటి వాళ్లం. మనలో హెచ్చు తగ్గులంటూ లేవు. ఒకరి అభిప్రాయాన్ని యిష్టాయిష్టాల్ని మరొకరు గౌరవించాలి' అని కబుర్లు చెప్పింది మీరేగదూ?' ఉషారాణి అడిగింది.

'అదంతా పెళ్లయిన కొత్తల్లో.'

'యేమాత్రం సంకోచించకుండా యెలా అనేస్తున్నారు? రెండేళ్లలోనే అంతా మారిపోయిందన్నమాట!'

'మారిందేంలేదు. ముఖ్యంగా నేను మారలేదు!'

'మారిందల్లా మీరే. యిదివరకు ఆఫీసు నుంచిరాగానే యింట్లో కూర్చొని, నాకన్ని ట్లోనూ అడ్డు పడూ, హాస్యమాడూ, ఏడిపిస్తూ యెంత సర్దాగా ఉండేవారు! యిప్పుడసలు నాతో తిన్నగా మాట్లాడ నైనా మాట్లాడుతున్నారా? మీ చీట్ల పేక, మీ స్నేహితులు తప్పించి యింకో లోకమే కనపడ్డం లేదు. నా ఉనికే గుర్తు తెలియనట్టుంది. ఒకప్పుడు ఆపీసు నుంచి వచ్చీరాగానే నేను అంతఃపురంలో కనపడలేదంటే యిల్లంతా వెతికేవారు. ఇప్పుడు ఆ వెతుక్కోవడమూ లేదు. ఆ బాధా లేదు. ఎందుకింత మార్పు వచ్చింది? మీ దృష్టిలో నా విలువ యింత పడిపోవాలా? యింకోడితో దగ్గరవుతుందేమో అని కూడా భయపడరా? నా స్నేహితులు అని తప్పించి యింకో దొడన పట్టుకొందా?'

'యీ ప్రశ్నలన్నీ యిప్పుడు అప్రస్తుతం.'

'యింత దాకా వచ్చింది గాబట్టే, యిప్పుడే యివన్నీ తేలిపోవాలి! యివన్నీ యిప్పుడు కాక పోతే యింకెప్పుడు ప్రస్తుతం? యిదివరకు వద్దన్నా వినకుండా నేను జడ అల్లు కుంటూంటే చూస్తూ ముందు కూర్చొని ముంగురులు ముందుకులాగి, చెంపల్ని వంకలు దిద్ది అలంకరణలు చేసేవారు; యిప్పుడసలు నేను యెన్నిరకాల స్టయిల్సు మార్చినా మీరు కన్నెత్తి చూస్తున్నారా? యిదివరకట్లా అలంకరించకపోతే పోయె, అసలు మంచో, చెడో ఓ మాట అంటు న్నారా?'

'నాన్సెన్స్!'

'యివాళేమైనా సరే. యీ నాన్సెన్సంతా మీరు భరించాల్సిందే! యివాళ నేను కట్టు కున్న చీర చూశారా? యిది మీరు బొం బాయి వెళ్ళినప్పుడు యెంతో ప్రేమగా నోరెడు డబ్బు పోసికొని తెచ్చింది! యిది కట్టుకున్నప్పుడల్లా నలిపి ఊపిరి సలప కుండా ఉక్కిరిబిక్కిరి చేసేవారు! యివాళ యిది కట్టుకొని అరగంట మీ ముందు నిలబడ్డా నా వంక చూడ్డానికే మనస్క రించడంలేదు!'

వెంకట్రావు ఓ దొంగ చూపు చూశాడు. సమాధానం వెంటనే దొరకలేదు.

'అసలు, మీతో పెళ్ళి కాబోతున్నందుకు యెంత గర్వపడేదాన్నో! అందరూ నాకు రాబోయే చీరలు, నగలు, కార్లు, బంగ ళాలు గురించి అనూయపడితే, నేను 'నా కివేం వద్దు భగవంతుడా, ఆయన సహృద యులు, సరసులు అని విన్నాను, నా కదే కదే చాలు!' అని ప్రార్థించేదాన్ని. మీ నాలుగు డిగ్రీలు, నాలుగంకెల జీతం గురించి నే నెన్నడూ ఆలోచించలేదు! మీకు సంస్కృతి, సాహిత్యంలో అభిరుచి ఉన్నాయని, రసికులని ఆశపడ్డాను!'

వెంకట్రావు గుటకలు మింగసాగాడు, తను నిజంగానే మారిపోయాడా? తను చేస్తున్నది తప్పా? ప్రశ్నలు లేచాయి.

'అంతెందుకు? నా పుట్టినరోజు యింకో వారంరోజులకి వస్తుందనప్పట్నుంచి యెన్ని ప్లాన్లు వేసేవారు? పిక్నిక్‌లు, సినిమాలు, యేకాంత విహారాలు! క్రిందటిసారి యెంత సర్దాగా గడిపాం? ఆఫీసుకి సెలవుపెట్టి, ప్రేమించమని ప్రాకులాడే అబ్బాయిలాగా, హోటల్లో లంచ్, జమ్రూద్ లో సినిమా, సాయంకాలం పబ్లిక్ గార్డె న్స్‌లో గుబుర్ల చాటున యేవో పిచ్చి కబుర్లు. రాత్రి రూఫ్ గార్డెన్లో మూన్ లైట్ డిన్నర్, నన్ను సిగ్గుతో ముంచెత్తి లాగ అందరి మధ్యా ఆదేపనిగా చూడ్డం, దొంగదొంగగా తాకడం, నా కిష్టమైనవన్నీ చెప్పకుండా, అనుకోకుండా బహుమతివ్వడం, అన్నీ చేశారే! యీ ఒక్క యేడాదిలో యెంత మార్పు! యివాళ నా పుట్టిన రోజన్న సంగతే గుర్తు లేదు మీకు!, కంఠం రుద్ధమై వణుకుతుంటే రాణి గది లోకి పరుగెత్తింది.

వెంకట్రావుకి ఉన్నట్టుండి దిమ్మెరపోతగా వర్షించినట్టు, ఆ వర్షంలో తను కదల కుండా నిలబడ్డట్టు అయింది. యేం చెయ్యాలో, యేం మాట్లాడాలో తట్టలేదు. ఆరోజు పుట్టినరోజా? యేమో. ఈ తెలుగు తిదులు వారాలు, నెలలు అటూ యిటూ అవుతుంటాయి! ఆలెక్క తెలిసిచావదు!

తలుపు తట్టాడు. 'రాణీ' 'రాణీ' అంటూ, జవాబులేదు.

'రాణీ డార్లింగు!...ఒక్కసారి!'

'పోండి, లోపలికి రానక్కర్లేదు, నాతో మాట్లాడక్కర్లేదు!'

'అలాక్కాదు! ఒక్కసారి నన్ను సమా ధానం చెప్పుకోనీ!'

'మీ సమాధానాలు నాకేం అక్కర్లేదు!'

'ఒక్కసారి! ప్లీజ్.. నామాటవిను.'

'ఊ' ఏమిటి?' తలుపులు రెండు చేతుల్తోనూ తీసి అడ్డంగా పట్టుకొని నిల బడి అడిగింది. చీరమార్చుకొంది. జుట్టంతా విడింది. కళ్ళు యెర్రబడ్డాయి. విప్రలబ్ధ నాయికా వేషం లాగుంది.

'నన్ను లోపలికి రానియ్య' అంటూనే ఆమె బుజాలమీద చెయ్యేసి లోపలికి నడవ బోయాడు. ఆమె విదిలించుకొని ప్రక్కని జేరి తలగడలో మొగం దాచుకొని వెక్కి వెక్కి యేడవసాగింది.

వెంకట్రావు యింకేమన్నా తట్టుకో గలడుగాని, 'కలకంఠి కంటనీరు' భరించ లేడు పైగా తనెరిగుండగా అదే మొట్ట మొదటిసారి రాణి యేడవడం. తను కారణంగా ఆమె అలా అంతగా బాధపడ్డం తన విద్యా సంస్కారాలకి, సభ్య సంస్కృతులకి గొడ్డలి పెట్టు, చావుదెబ్బ అనుకున్నాడు వెంకట్రావు మతిపోయింది. యేం చెయ్యాలో పాలుపోలేదు. యెలాగన్నాసరే, తనకిష్టమైన వన్నీ త్యాగం చేసయినాసరే, ఆమె బాధకి ఉపశమనం కలగజెయ్యాలని నిర్ణయించు కున్నాడు

'డార్లింగ్, స్వీట్, బేబీ...' నసుగుతూ



## ఫెం రా ప్

ఆమె బుజాలు పట్టుకొని తిప్పుకో బోయాడు. విప్పుకొన్న జుట్టంతా సవరించి తల నిమరబోయాడు. వీపుమీద ఓదార్పుగా రాశాడు.

'పోండి!' రాణి తల యెత్తకుండానే కసిరింది.

'అలా అంటే నే నేమైపోవాలి చెప్పు. మర్చిపోయాను, తప్పు ఒప్పుకుంటున్నాగా! లే, ప్లీజ్! నీ యిష్టం వచ్చినమాటలను, పడ్తాను. కాని, యిలా వొద్దు!' వొంచుకున్న మెడమీద పెదాలాన్చి చెవిలో మర్మరించాడు.

రాణి గిరుక్కున వెనక్కి తిరిగింది. వెంకట్రావు కళ్లలోకి చూసింది. వెంకట్రావు రాణి కళ్లలోకి చూసి నవ్వాడు.

'నేను వట్టి...వట్టి...నాకు సరైన తిట్లేవీ రావడంలేదు; నువ్వే తిట్టెయ్!' అన్నాడు, చెంపల్ని కట్టిన చారల్ని తుడుస్తూ.

'ఛా! నేను పతివ్రతని!' సిగ్గుపడింది రాణి.

'పతివ్రతలు కూడా కొండొకచో తిట్టవచ్చని అదేదో ఉపనిషత్తులో వ్రాశార్ట. పైగా నువ్వు తిట్టకపోతే నా పాపానికి నిష్కృతి ఉండదు, రాణీ ఉండదు. నా మనసుకి శాంతి అంటూ రాదు. ఉషా, రానేరాదు!' అని దేశవాళీ సినిమాల్లో నాయకులమాదిరి ఆమె ముంజేయిని రెండు చేతుల్లోకి తీసుకొని నలుపుతూ కళ్లు మూసుకొని పెదాలు గట్టిగా కొరుక్కున్నాడు. రాణికి నవ్వు విపరీతంగా వచ్చింది. వెంకట్రావూ నవ్వాడు.

'మీరు వట్టి...వట్టి పాపి!' అంది ఉషారాణి.

'హత్తెరికి! యింతాజేసి యింత చప్పతిట్టా!'

'మీరు వట్టి, దుష్టుడు, దుర్మార్గుడు...'

'అలా మొత్తం కౌరవుల పేర్లన్నీ చదివెయ్యి. అప్పుడుగాని నాకు, ఉపశాంతి కలగదు!'

'అదలా ఉంచి, నేను చెప్పేవన్నీ వింటేనే, ఊరుకొనేది!'

'నీయిష్టం, నీనోటికేది వస్తే అదల్లా చెప్పెయ్యి!'

'నేను యెప్పుడన్నా మా మీటింగులకి

వెళ్ళేప్పుడు అడ్డు చెప్పకూడదు!'

'చెప్పను. నువ్వు రోజూ వెళ్ళినా అభ్యంతరం లేదు.'

'మన యింట్లోనే మీటింగులయితే మీరు మూతి ముడుచుకోకూడదు.'

'ముడుచుకోడం మాటలా ఉంచి, ఛస్తే ఒక్కమాటనను.'

'మిమ్మల్నేదన్నా అడిగితే విసుక్కోకుండా సహాయం చెయ్యాలి!'

'యిహమీదట మీ మండలే నా జీవిత సర్వస్వమను కుంటాను. పిల్చినా పిలవక పోయినా యేది పడితే అదే సేవజేసేస్తూంటాను!'

'అలా వేళాకోళం చేయకూడదు!'

'చెయ్యను.'

'సాయంకాలం ఆఫీసు నుంచి తిన్నగా యింటికే రావాలి.'

'వస్తాను.'

'యెప్పుడోగాని క్లబ్‌లో గంటకి మించి ఉండకూడదు!'

'మీ సమావేశాలున్నప్పుడు తప్పించి యింకెప్పుడూ అసలు క్లబ్ కెళ్ళను!'

'నేను చెప్పే ప్రతీ మాటకీ తలూప గూడదు; అప్పుడప్పుడు మీరు మీలాగే ఉండాలి!'

'అప్పుడప్పుడు నేను నాలానే ఉంటాను!'

'అప్పుడప్పుడు తమాషాగా సర్దాగా నన్నేడిపిస్తుండాలి!'

'నువ్వు తమాషా, సర్దా మూడ్‌లో ఉండేప్పుడు ఏడిపిస్తుంటాను.' ఆ తర్వాత వాళ్ళిద్దరూ గట్టిగా నవ్వుకొని, వికాజీస్‌లో భోంచేసి, రెండోఆట సినిమా చూసి రాత్రి ఒంటి గంటకి గూటికిజేరితే జేరారు, అది కధకి అనవసరం.

ఆ మర్నాడు అఖిల ప్రేమనగర్ పురుషజన మహాసభ సాధారణ సమావేశం అత్యవసరంగా జరిగింది. అందరి మొగాలు విచారాన్ని, ఒక విధమైన మౌనాన్ని సూచిస్తున్నాయి. రామశాస్త్రి మొదలుపెట్టాడు.

'సోదరులారా!

కొన్ని అత్యవసర కారణాలవల్ల, యీ సంఘ కార్యకలాపాల్తో సంబంధం పెట్టుకోలేక పోతున్నానని చెప్పడానికి విచారంగా ఉంది. యిహమీదట క్లబ్‌లోనే ఓ గంట కన్నా యెక్కువసేపు ఉండలేనేమో! నన్ను క్షమించండి!'

కొద్ది నిమిషాల్లోనే, అందరి సంగతీ అంతేనన్న సంగతి విదితమైంది. గాఢ ప్రశాంతి అలుముకుంది.

దాన్ని చీలుస్తూ కృష్ణమూర్తి గట్టిగా నవ్వాడు. అంతా, అతనివైపు చూశారు.

'అదికాదండీ! మీరంతా సూటిగా, తిన్నగా వాళ్ళు తవ్విన గోతిలోకి దిగారు అన్న సత్యం ప్రకటించాల్సి వచ్చినందుకు విచారిస్తున్నా. మన ఘెరావ్ సంగతి వాళ్ళకి తెలిసింది. వాళ్ళ కసలు నిన్న నిజంగా సమావేశంలేదు కాని అందరి యిళ్ళల్లోనూ అలా నటించి, మన ఆట కట్టించాలని యెత్తు వేశారు వాళ్ళు! 'నువ్వు చాలా సరసుడివి, రసికుడివి' అని ఆడదంటే బోల్తాపడని మగాడులేడు. మన యీ బలహీనత నుపయోగించుకొని, అవసరమైతే కన్నీళ్ళు జోడించి, మీ చేతులూ కాళ్ళూ కట్టేశారు. మీచేత అడ్డమైన ప్రమాణాలూ చేయించారు. మన ఘెరావ్‌కి ఆదిలోనే, భరతం పట్టించారు.'

గట్టిగా నవ్వసాగాడు కృష్ణమూర్తి.

అంతా చిన్నబోయి మొగమొగాలు చూసుకున్నారు. దగ్గిరున్న అడ్డమైన పేపర్లూ, మాగజైన్లూ కలియబడి చదివేయసాగారు, అతను చెప్తోందేం వినిపించుకోనట్టు. గాఢ నిశ్శబ్దం అలుముకుంది.

'యివన్నీ మీకెలా తెలుసు! అసలు మనం ఘెరావ్ చెయ్యబోతున్నామని వాళ్ళకెలా తెలిసింది?' కోపంగా అడిగాడు రాజు.

'నా శ్రీమతికి నాకు మధ్య రహస్యాలేం లేవు; అసలు వాళ్ళు సమావేశం అవుతున్నారని దొంగవార్త చెప్పింది ఉత్తినే తమాషాకి! మొదట్నుంచీ మేమిద్దరం యీ తమాషా అంతా చక్కగా యెంజాయ్‌చేశాం!'

'ప్రతీ మంచి ఉద్యమానికి యిలాంటి నక్షత్రకులు ఉంటూనే ఉంటారు! సంఘ పురోభివృద్ధికి వేరు పురుగుల్లాంటి యీ నల్ల గొర్రెల్ని వెంటనే బహిష్కరించాలి!'

'ఉద్యమం, సంఘం మాట దేవుడెరుగు! ముందు యిలా మాటలు జేరేసే వాళ్ళని దూరంగా ఉంచాలి!'

'నన్ను మీరు, ఆమెని వాళ్ళూ బహిష్కరించే లోపల యిద్దరం రెండు ఉద్యమాలకి సంఘాలకి రాజీనామా యిస్తున్నాం. మొదట్నుంచీ మా యిద్దరికీ యిలాంటి కార్యక్రమాలంటే ఒక విధమైన అయిష్టత, అసహ్యం. అందువల్లనే, యెవరికీ యిందులో పెద్ద ప్రమాదకరం లేదనే ఉద్దేశ్యంతో అబద్ధాలు, దొంగమాటలు చెప్పడం జరిగింది. అయినా క్షమించమని వేడుకుంటున్నాను; బై బై' కృష్ణమూర్తి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత యింటికి జేరగానే, ఉప్పెనలా రాణిని వాటేసుకుని, 'నిన్న మనం ఆడిన నాటకం చాలా బాగుంది కదూ!' నవ్వాడు వెంకట్రావు.

రాణి మొదట్లో తబ్బిబ్బై కొద్దిసేపటికి నవ్వేసింది.

యెంతటి పెద్ద అవమాన్నైనా, నేరిగ్గా లెక్క చెయ్యనట్టు నటించడంలో, అందరికీ అలా కనబడ్డంలోనే ఆ అవమానం చేసిన వాళ్ళకి గట్టి ప్రతీకారం జరుగుతుందని చిన్నప్పుడు యింగ్లీషు పుస్తకంలో చదువుకున్నాడు వెంకట్రావు

(అయిపోయింది)





# దొంగనోట్లు

తమిళ మూలం: ఎం. వి. వెంకట్రామ్
తెలుగు అనువాదం: ఆర్. శివరాజన్

నాకు అత్యాశలేదు. అయినా సులభంగా డబ్బులొస్తాయంటే ఎవరికైనా 'ఆశ' వుంటుంది. అటువంటి అమూల్యమైన అవకాశం, ఒకరోజు తెల్లవారుఝామున నా మిత్రుడు కుప్పుస్వామి రూపంలో వచ్చి నన్ను తట్టి మేల్కొల్పింది!

వాడి తొందరపాటూ, కంగారూ చూసి, ఏం కొంపమునిగిందో అని భయపడూ, 'ఏమిట్రా సన్నాసీ! ప్రొద్దున్నే వూడిపడ్డావ్! ఏమిటీ విశేషం?' అని అడిగాను.

'మొహం కడుక్కుని తొందరగా బయల్దేరు. మా యింటికి వెడదాం. దారిలో ఏదైనా హోటల్లో కాఫీ తాగొచ్చులే! ఒక 'మాంఛి' కబురుంది' అని వాడు ముగించాక నా ప్రాణం కాస్త కుదటపడింది.

దారిలో కుప్పుగాడు ఆ 'మాంఛి' కబుర్ని వెల్లడించాడు.

ఇబ్రహీంతో కుప్పుస్వామికి రెండేళ్ళుగా పరిచయంవుంది. తిరుచ్చినాపల్లిలో టీ కొట్టు వ్యాపారం నడుపుకుంటున్నాడు. వాడు రెండు రోజులుగా కుప్పుస్వామి యింట్లో మకాం వేసి, ఒక కొత్త వ్యాపారాన్ని గురించి వివరించి, అందులో కుప్పుస్వామిని కూడా పాల్గొమని తెగ రొద పెడుతున్నాడుట.

మా యిద్దరికీ ఆ వ్యాపారం కొత్తది. కాని ఇబ్రహీమ్‌కి అందులో బాగా అనుభవం వున్నది. కుప్పుస్వామికికూడా ఒక 'ఛాన్స్' యిప్పించి వాణ్ణి అమాంతంగా ఒక లక్షాధికారిగా మార్చాలని వచ్చాడుట.

వ్యాపారం ఏమిటో తెలుసా? ఎంతవచ్చినా సరిపోవడంలేదు; నోట్లు ముద్రించి పెట్టుకోవాల్సిందే' అని అప్పుడప్పుడు మనం వినుక్కుంటామే—అదే పనిని 'నాగర్‌కోయిల్' ప్రాంతంలో ఎక్కడో వున్న ఒక అడవి మధ్య, ఒక ముఠావాళ్ళు జయప్రదంగా సాగిస్తున్నారట. ఆ ముఠాకు ఇబ్రహీం 'ఏజంటు. అడవిలో ముద్రించబడే నోట్లను సమాజంలో చెలామణి చెయ్యడం ఆయన 'డ్యూటీ'. అసలైన నోట్లకు అయిదురెట్లుం ఆ దొంగనోట్లని యిచ్చేట్లు ఇబ్రహీం చెప్పాడుట.

'చిల్లర వ్యాపారం వద్దంటున్నాడు: అయిదువేలకు పైసా తగ్గినా బేరం చెయ్యడానికి సిద్ధంగా లేడు. ముందు మూడు వేలకు క్రొత్తనోట్లు మార్చియివ్వమని అడిగాను. ఒప్పుకున్నాడు' అన్నాడు కుప్పు.

కొత్త వ్యాపారంలో వున్న అపాయం నన్ను కంగారు పెట్టింది. శ్రీ కృష్ణ జన్మస్థానానికి వెళ్ళడానికైనా వెనుదీయని బుద్ధాయికైతే యిది కుదుర్తుంది!

'తప్పుడు మార్గం కుప్పూ! నాకిష్టం లేదు' అన్నాను.

'చెప్పేది పూర్తిగా విన్రా! నాకూ ముందు భయంగానే వుండేది. ఇబ్రహీం మాటలనుబట్టి, ఈ వూళ్ళోని పెద్ద మనుషులందరూకూడా 'సరకును' కొన్నట్లు తెలుస్తోంది.''

'సరేగానీ, ఒకటికి అయిదు రెట్లుగా సంపాదించి లక్షాధికారివికాగానే నన్ను మర్చిపోతావేంట్రా?' అన్నాను నవ్వుతూ.

'పప్పులేకుండా పెళ్ళా...! నువ్వులేకుండా

నేను మట్టుకు యిందులో చస్తే దిగను! సుబ్బరామయ్యర్ కూడా మనతో 'వాటా' చేరాడు. చెరొక్క వెయ్యిరూపాయలు' అన్నాడు కుప్పు.

సుబ్బరామయ్యర్ పేరు వినగానే నా కాశ్చర్యం వేసింది. మా పేటలో ఆయన 'బిగ్ షాట్'. ఒట్టల వ్యాపారం. ఆయన కూడా యిందులో 'భాగస్వామి' కాబోతున్నాడని వినగానే, నా మనసు అదోరకంగా సడలింది. నాతో అస్తమానం తిరిగే కుప్పుగాడికి. నా మనసు 'ఇద్దై' పోవడం అర్థమైపోయింది.

'మనం దీన్ని అలవాటు చేసుకోనక్కర్లేదురా! మహాయితే రెండు మూడుసార్లు చేసేసి, 'టప్' మని ఆపేద్దాం' అన్నాడు.

'అది సరేగానీ, ఇబ్రహీం ఎటువంటి వాడు?'

'చాలా నమ్మకస్తుడు. రెండేళ్ళగా వాడితో పరిచయం.'

'సరకు మన యిళ్ళకే వస్తుందా?'

'తంజావూరికి వస్తుంది. అక్కణ్ణుంచి తెచ్చుకోవడం మన బాధ్యత'

'ఇబ్రహీం దగ్గిరే సరకు వున్నదా?'

'లేదు. సరకుకి 'బాస్' మరో వ్యక్తి. వాణ్ణి రేపు తంజావూర్లో కల్సుకుంటాం. వాడే సరకును స్వయంగా మనకు అందజేస్తాట్ట. ఇబ్రహీం ఏజంటు; వాడికి కమిషన్ ముడుతుంది.'

'ఎందుకో నాకు నమ్మకం కుదరడం లేదురా కుప్పు! సొమ్ముతోపాటు పరువు కూడా 'శివగోవిందా' అయిపోతుందేమో ?'

'ఒక్కరోజేగా యీ కష్టం?' అయ్యరే నాకు ధైర్యం చెప్పాడు

మాట్లాడుతూనే కుప్పుస్వామి కొంప చేరుకున్నాం. ఇబ్రహీంను అక్కడ చూశాను. ఎందుకనో వాడిమీద నమ్మకం ఏర్పడలేదు. కాని వాడి మాటల్ని విన్నాక కాస్త నమ్మకం కలిగియేడ్చింది. అయిదురూపాయల నోట్లను, వాడు బల్లమీద, చెత్తబుట్టలో పడేసినట్టు వేశాడు. అబ్బ! ఎంత పరీక్షించి చూసినా వీటికి మంచినోట్లకీ రవ్వంత తేడా కూడా కన్పించదేం?

'నేను రెండు నోట్లను బజార్లో మార్చాను' అన్నాడు కుప్పు.

'మొదట్లో కాస్త భయంగానే వుంటుంది. తర్వాత చూస్కోండి, మీరే నన్ను వెదుక్కుంటూ వస్తారు. మీ మంచితనాన్ని చూశాకే, మీకు నావల్ల అయిన సహాయాన్ని చెయ్యాలన్పించింది. అందుకే వచ్చాను' అన్న ఇబ్రహీం మాటలను విని, 'వాడు ఖచ్చితంగా కుప్పుగాణ్ని కోటీశ్వరుణ్ణి చేసితీరుతాడు' అనిపించింది నాకు.

చివరకు వాడు అయిదువందలు అడ్వాన్సుగా పుచ్చుకున్నాడు. నేను వెనకాడుతూ వుండగానే, బేరం కుదిరిపోయింది. మర్నాడు సాయంత్రం నాలుగుగంటలకి తంజావూర్లోని 'రాణిలాడ్జిలో' బాస్‌తోపాటు సరకునికూడా పట్టుకొచ్చి కల్సుకుంటానని వాగ్దానంచేసి ఇబ్రహీం వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి నా గుండె 'దడదడ' కొట్టుకోసాగింది. నిద్రపట్టలేదు. కాస్త కూస్త నిద్ర పట్టినప్పుడు కలవచ్చింది. 'అయిదురూపాయల నోట్ల కట్టలో విసురుకుంటున్నట్టు' మంచి కలేదైనా వచ్చియేడ్వకూడదూ? అన్నీ పాడుకలలే! 'ఒక పెట్టెనిండా సరకుని తెచ్చి పెట్టెను తెరుస్తున్నపుడు 'దభీలు'మని పోలీసులు ఊడిపడి మా ముగ్గుర్నీ అరెస్టు చేసినట్టు, ఇంకా ఇటువంటి పాడు కలల్ని గంపెడు కన్నాను. ఈ పాడు వ్యాపారంనుంచి విరమించుకుంటామన్పించింది. అయ్యర్‌లాంటి మహాపురుషులే చేస్తున్నారుగా? వాళ్ళకొచ్చే కష్టమేగా మనకూ వస్తుంది? హ్హ్హ... అన్న ధీమా యేర్పడగానే మనసు కాస్త స్థిమితపడింది. ఎట్లాగో తంటాలు పడి రెండుమూడుసార్లు చేస్తే చాలు. తర్వాత మానేద్దాం అనుకున్నాను.

ఆ మర్నాడు నేను, అయ్యర్, కుప్పుస్వామి—ముగ్గురం తంజావూరికి ప్రయాణమైనాం.

ట్రెయిన్‌లో మేము 'బిజినెస్' గురించి ఒక్క ముక్కకూడా మాట్లాడుకోలేదు. తంజావూర్‌లో కాలు పెట్టిన మరుక్షణమే మేం ముగ్గురం అసలైన దొంగల్లా మారిపోయాం. లక్షా తొంభై కళ్ళు మమ్మల్నే చూస్తున్నట్టు అనిపించింది. గుండెల్లో ఒకటే 'దడదడ'.

రాణీ లాడ్జిలో రూం ఎవరి పేరిట తియ్యాలన్న సమస్య చర్చనీయాంశంగా తయారైంది. 'చచ్చినాసరే నా పేరుమీద గది బుక్ చెయ్యడానికి ఎంతమాత్రం వీల్లేదు' అని ఖచ్చితంగా చెప్పేశాను. రేపెద్దైనా గొడవవస్తే, ఫలానారోజు నేను తంజావూర్లో వున్నట్టు సాక్ష్యం వుండకూడదని నా అంతరాత్మ మెదడుకి నూరిపోసింది. చివరకు అయ్యర్ తన పేరుతో రూం బుక్ చేశాడు. మా ముగ్గురిలో వాడే కాస్త ధైర్యశాలి అనిపించింది.

సాయంకాలం నాలుగు, అయిదు, ఆరు గంటలు దాటినా ఇబ్రహీం పత్తాలేడు. 'ఆరి బద్మాష్' అని వాణ్ణి లోలోపల తిట్టుకుని తృప్తిపడ్డాను. షుమారు ఏడుగంటలకు ఇబ్రహీం గదిలోకొచ్చాడు.

'బాస్ యింకో అరగంటలో వస్తాడు. సొమ్ము రెడియా?' అని అడిగాడు.

'సరకు రెడీయా?' ఎదురు ప్రశ్న వేశాను.

'రెడీ డైరెక్టుగా మెయిల్‌లో వచ్చేస్తుంది. డబ్బు సిద్ధంగా వుందా?'

'ఓ యెస్', అన్నాడు కుప్పు.

'ఎందుకైనా మంచిది. కాస్త జాగ్రత్తగా వుండండి.'

'ఎందుకీ హెచ్చరిక?' నా కంఠం భయాన్ని వ్యక్తం చేస్తూ ధ్వనించింది.

'వ్యాపారం అలాంటిది. మీరు 'ముగ్గురుగా' వచ్చారు. హుం. సరే. నే వెళ్ళి బాస్‌గార్ని పిల్చుకొస్తా' అని ఇబ్రహీం వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళినతర్వాత, 'సరకుని లాడ్జింగ్‌కే తెస్తానని వూళ్ళో నరికాడు. ఇప్పుడు మెయిలంటాడేమిట్రా?' అని అడిగాను.

'అది మనకు మంచిదేగా?' అన్నాడు కుప్పు.

సుబ్బరామయ్యర్ మొహం చిట్లించాడు.

'మనం చేస్తున్నపని చాలా 'డేంజరస్' పగటివేళలో 'పక్కలు' చూసి మాట్లాడాలి. రాత్రయితే అది కూడా పనికిరాదు,' అని మా యిద్దర్నీ వారించి, వరండాలో కెళ్ళి ఈజీఛేర్‌లో కూలబడ్డాడు అయ్యర్. ఆయన రామభక్తుడు. వెయ్యినూటపదహార్లు రామనామాన్ని స్మరించి శ్రీరామచంద్రమూర్తిని తోడు రప్పించడానికి ప్రయత్నించసాగాడు.

కుప్పుగాడూ, నేనూ గదిలోనే పడుకున్నాం. అయ్యర్ వారించాడు కాబట్టి మా నోళ్ళు గట్టిగా మూసుకున్నాం. మాట్లాడాల్సినవన్నీ మా మనసులే వూహించుకున్నాయి. ఒకరి మొహం మరొకరు చూసుకోవడం తప్ప ఏమీ చెయ్యలేకపోయాం.

# దొంగనోట్లు

మెయిల్ టైం దాటిపోతోంది. బాస్‌గానీ ఇబ్రహీంకానీ పత్తాలేరు. వాళ్ళిద్దరూ రాకుండా వుంటేనే బాగుండు ననిపించింది నాకు.

అదే క్షణంలో అయ్యర్ గదిలో కొచ్చి జాగ్రత్తగా తలుపులు మూసి లోపల గడియ పెట్టాడు. వాడిపోయిన వాడి 'ఫేస్' చూసి అదిరిపడ్డాం.

'ఏమిటి విశేషం?' మా యిద్దరి కంఠాలూ 'కోరస్'గా ధ్వనించింది.

'ఆ చివరిగదిలో వున్నవాళ్ళను చూస్తే అనుమానంగా వుంది.'

'ఎంచేత?'

'మంచినీళ్ళు తాగడానికి పైప్ దగ్గిరికెళ్ళాను. చివరిగదిలో వున్న యిద్దరిలో ఒకడు, నన్ను నీడలా వెంటాడుతూ వచ్చి గోడవెనుక నిల్చున్నాడు. నాళ్ళకి తెలియకుండా 'అబ్జర్వ్' చేశా! ఒకడు వెళ్ళివచ్చిన తర్వాత మరొకడు బయటకెళ్ళి వచ్చాడు. బహుశ భోంచెయ్యడానిక్కాబోలు.'

'ఒకవేళ...'

'సి. ఐ. డి! లయ్యుంటారేమో? ఏదైనా క్లూ దొరికి వచ్చి, దర్యాప్తు చేస్తున్నారేమో?' కుప్పు గజగజ వొణుకుతూ అడిగాడు.

'అబ్బెబ్బే. నాకలాంటి అనుమానమేమీ లేదు. ఎందుకైనా మంచిది. జాగ్రత్తగా వుంటేసరి. రామూగారూ, మీరు వెళ్ళి భోంచేసి క్యారియర్‌లో మాక్కూడా పట్టుకొస్తారా?'

'హోటల్ వాడ్తో నాకు పరిచయం లేదే...' అన్నాను. నిజానికి ఒంటరిగా వెళ్ళడానికి భయమేసింది

'మీరు వెళ్ళొస్తారా కుప్పుగారూ? నేను ఆ చివరిగది వ్యక్తులమీద 'నిఘా' వేసి వుంచుతాను'

అయ్యర్ చెప్పి ముగిస్తున్నపుడే ఎవరో తలుపులు తట్టారు.

ఊపిరి ఆగిపోయినంతగా ఫీలయ్యాం. బయట ఎవరు? బాసా లేక పోలీసులా?

అయ్యర్ వెళ్ళి తలుపు తెరిచాడు, ఇబ్రహీంతోపాటు మరో వ్యక్తికూడా గదిలోకి వచ్చాడు. అయ్యర్ తలుపులు మూశాడు.

'తలుపులు మూయడమెందుకు? ఎవరైనా చూస్తే అనుమానపడ్తారు. బార్లా తెరిచివుంచండి' అన్నాడా కొత్తవ్యక్తి. మాయిద్దరికీ బుద్ధిచెప్పిన అయ్యర్ ఆ కొత్త వ్యక్తి ఆదేశాన్ని పాటించాల్సి వచ్చింది.

ఆ క్రొత్త వ్యక్తిని పరీక్షగా చూశాను. వాడియొక్క లోతుపాతుల్ని నా అమోఘమైన తెలివితేటలతో ఇట్టే పసిగట్టేయాలనుకున్నాను. చాలా చాలా పెద్దమనిషిలాగా 'రిచ్'గా 'ట్రిమ్ము'గా అగుపించాడు. వాడి దుస్తుల్నీ, ఆ ఠీవిని చూస్తే 'సరకు వ్యాపారస్థుడని' ఎవ్వరూ అనుకోరు. యమ దర్జాగా వున్నాడు. 'మూడువేలం ఖర్మ, ముప్ఫయివేలైనాసరే వాడి చేతుల్లో నమ్మి యివ్వొచ్చు' అనుకున్నాను. అతని నామధేయం 'సోమసుందరం' అని తెలియవర్చాడు ఇబ్రహీం.

సోమసుందరం నన్నుద్దేశించి 'మీరేనా సుబ్బరామయ్యర్?' అని అడిగాడు. నేను తల విదిలించి అయ్యర్ని చూపించాను.

'మీ లాంటి పెద్దలు యింత చిన్న మొత్తాలు వ్యాపారం చెయ్యడం ఏమీ బాగోలా... ఒక్కసారిచేసినా అరవై, డెబ్భై వేలైనా చెయ్యొచ్చుగదా' అడిగాడు సోము.

'ఇది సాంపిల్ ఆర్డరేగా? ఒకసారి అలవాటుపడితే ఆ తర్వాత ధైర్యంగా చెయ్యొచ్చు' అన్నాడు అయ్యర్.

'అదీ నిజమే! మీ హోదా గురించి విన్నాకే, యింత చిన్న బేరానికి ఒప్పుకున్నాను. మేము దర్బారు హోటల్లో బసచేశాం. సరకు అక్కడే వుంది, అది సరేగానీ, అడ్వాన్స్ తక్కువగా పంపారే? సగమైనా అడ్వాన్స్ లేకపోతే మేం వ్యాపారం చెయ్యలేం. దేనికైనా మంచిది మరో వెయ్యి రూపాయలు ఇవ్వండి. రాత్రి రెండున్నర బండి మనకు కన్వీనియంట్‌గా వుంటుంది. మీరు ముగ్గురూ వ్యాపారానికి కొత్త. అంచేత సరకుని మీ వూరికే చేర్పించేసి బాకీ సొమ్ము పుచ్చుకుంటాను' అన్నాడు సోము.

మొదట యిచ్చిన అయిదువందలే కాక, నాజూకుగా, మరో వెయ్యికి సోము ప్లాను వెయ్యగానే, నేను కుప్పు మొహాన్ని పురిమి చూశాను. కుప్పు అయ్యర్ మొహాన్ని చూచాడు. అయ్యర్ ఇబ్రహీం మొహాన్ని చూశాడు ఆ తర్వాత ఆరుకళ్ళు మాట్లాడుకున్నై). కనుఃభాష యెంత మంచిదో అప్పుడు బోధపడింది నాకు. 'ఇబ్రహీం నమ్మకస్థుడే' అన్నట్లు సంజ్ఞచేశాడు కుప్పు.

'నీట్లో దిగనిదే యీదడ మెట్లా?' అని యేడిశాడు అయ్యర్, 'సరే కానీ!' అని సంజ్ఞ చేశాను,

'పాలుకు మూడు కోట్లు సరకు తయారుచేస్తాం. కోయంబత్తూరు మా కేంద్రస్థలం. అక్కడే మా సరుకంతా చెలామణీ చేస్తాం. కాని ఇబ్రహీంలాంటి వాళ్ళు వేధిస్తున్నారు. కాబట్టి ఇతర జిల్లాల్లో కూడా కొంత సరఫరా చేస్తున్నాం. అవునా ఇబ్రహీం?' అడిగాడు సోము.

'మా బోటి వాళ్ళుకూడా బ్రతకాలికదా బాస్?' అని అతి వినయంగా సమాధానమిచ్చాడు ఇబ్రహీం.

'సరకును చూపించకుండానే మళ్ళీ అడ్వాన్స్ అడిగితే...' నేను మెల్లగా మొదలెట్టాను.

సోము మొహం చిట్లించి చూడు. తన బాస్‌ని అవమానించినట్లు వురిమి చూశాడు ఇబ్రహీం

'ఆపాటి నమ్మకం లేకపోతే అసలు వ్యవహారాన్నే మానేద్దాం' అన్నాడు సోము కటువుగా.

'నమ్మకం లేకా యింతదూరం వచ్చాం? సరే కానివ్వండి రెండున్నర బండికి తప్పక వచ్చేయండి' అంటూ అయ్యర్ పదివంద రూపాయిల నోట్లను లెక్కపెట్టి సోము కిచ్చాడు.

ఆయన, సోముచేతుల్లో డబ్బిస్తున్నప్పుడే, కిటికీనుంచి మమ్మల్నిచూస్తూ కదిలిన ఆకారాన్ని పసిగట్టాడు అయ్యర్.

'వాడే...' అన్నాడు అయ్యర్ భయంతో.

'వాడెవడు?'

'ఆ చివరిగదిలో వీడూ, యింకోడూ వున్నారు. మేం దిగినప్పట్నుంచీ మమ్మల్ని కాపలా కాస్తున్నారు.'

'ఎవరైతే మనకేం? ఈ సమయంలో ఎవర్నిచూసినా మీకు అనుమానంగానే వుంటుంది. సరేగానీ రెండున్నర బండికి వస్తారుగా? మీా కంపార్టుమెంట్లోనే నేనూ వస్తాను.'

ఇబ్రహీం అన్నాడు, 'ఎందుకైనా మంచిది. ఉషారుగా వుండాలి మీ కేదైనా అనుమానంవేస్తే గదిని ఖాళీచేసి సినిమాకు వెళ్ళి, అక్కణ్నుంచి సరాసరి స్టేషన్‌కు వచ్చేయండి.'

# దొంగనోట్లు

ఆ సలహా నాకు నచ్చలేదు. 'రూం ఖాళీ చెయ్యడం బావుండదు. అనుమానానికి చోటుచేస్తుంది. సుబ్బరామయ్యర్‌గార్ని రూంలోనే వుండనీ. నేనూ కుప్పుస్వామీ కలిసి రాత్రి పదిన్నర బండికే వూరెళ్తాం. సరకొస్తే భద్రపర్చాలిగా?' అన్నాను.

నా సలహాను అయ్యర్ వ్యతిరేకించాడు. 'సరుకు మాయింటికేగా రావాలి?' అంచేత నేనే ముందుగా వెళ్తాను. మీ రిద్దరూ సరకుతోసహా వద్దురుగాని' అన్నాడు.

'సరేగానీ, మీలో యెవరైనా రూంలో వుంటారుగా? అవసరమైతె మేం మళ్లీ వస్తాం. లేకపోతే స్టేషన్‌లో కల్సుకుంటాం' అని చెప్పేసి సోము ఇబ్రహీంతోపాటు వెళ్లిపోయాడు.

వాళ్లు వెళ్లినతరువాత మా ముగ్గురి మధ్యా మాటలు పెరిగాయి. ఊరికి క్షేమంగా చేరుకుంటే చాలు అనిపించింది నాకు. సరకుతోపాటు రైలు ప్రయాణం చెయ్యడానికి నామనసు తెగించడంలేదు స్వంత వూరిలోవుంటే అదొకలాంటి 'బలం' వుంటుంది. పొరుగూరిలో ఏం చెయ్యగలం? నాకు మల్లెవాళ్లిద్దరూ ఊహించుకుంటున్నారన్నదానికి తార్కాణంగా — వాళ్లుకూడా వూరికెళ్లాలని ప్రయత్నించారు. మేమిట్లా చర్చిస్తున్నప్పుడే, చివరిగది వ్యక్తులు కిటికీ ద్వారా రెండుసార్లు రూంలోకిచూసి వెళ్లిం దాన్ని గమనించాం.

'ముందు భోంచెయ్యాలి' అన్నాను.

రాత్రి పదిగంటలయింది. పక్కనున్న ఒక చిన్న హొటల్లో 'టిఫిన్' తినడానికి కూర్చున్నాం. మూడోబల్లదగ్గర ఆ 'చివరిగది ప్రభృతుల'తోపాటు ఒక పోలీసు కానిస్టేబుల్ కూడా కూర్చున్నాడు. వాళ్ళు ముగ్గురూ ఏదేదో మాట్లాడుకుంటున్నారు.

టిఫిన్ మా గొంతు దిగడమే కష్టమైపోయింది. తినకముందే కడుపులు నిండినట్లు అనిపించింది. చివరిగది వ్యక్తుల్నీ కానిస్టేబుల్నీ చూస్తూనేవున్నాం ఒకపక్క. వాళ్ళు మా విషయమే పట్టించుకోనట్టుగా ఏదేదో మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. అయ్యర్‌కి చలిజ్వరం వచ్చినట్టుంది.

'అయితే నే వెళ్ళొస్తాను. మీరిద్దరూ తంజావూరు పనులు ముగించుకొని, రేపు రాత్రికల్లా వచ్చేస్తారుగా?' అని అయ్యర్ మమ్మల్ని చూసి కన్నుగీటుతూ, తన గుమాస్తాలకు ఆదేశిస్తున్నట్టు మాట్లాడాడు.

పదిన్నరబండికే వూరెళ్ళడానికి ఆయన పన్నిన కుతంత్రం మా కర్థమైంది. నాకు ఒళ్ళుమండింది. కాని అది హొటలు. పైగా ఆ ప్రభృతులుకూడాను. ఏంచెయ్యగలం? మేం ఏదీ చెప్పడానికి ఛాన్స్ యివ్వకుండానే, — అయ్యర్ ఒక జట్కాబండిని మాట్లాడుకొని స్టేషన్‌కి తుర్రుమన్నాడు.

లాడ్జి చేరుకోగానే, మా మొహాలు 'దెయ్యందగ్గర లెంపకాయలు తిన్నట్టుగా' మారిపోయాయి. అయ్యర్‌లాగే మేముకూడా సామర్థ్యంగా ఊరికి వెళ్ళిపోవచ్చు. కాని, అడ్వాన్స్ సొమ్ము ఏంకావాలి?

చివరిగది వ్యక్తులను గురించిన భయం మమ్మల్ని తైతక్కలాడించింది. ఎవరు వాళ్ళు? కావాలనే మమ్మల్ని వెంటాడుతున్నారా లేక కాకతాళీయంగా అట్లా జరిగిందా? హొటల్లో వాళ్ళిద్దరూ కానిస్టేబుల్‌తోపాటు తటస్థపడ్డంకూడా కాకతాళీయమేనా? మమ్మల్ని వాళ్ళు చూసీచూడనట్టు వున్న విషయమే మా భయానికి మరింత కారణమైంది.

జీవితంలో నేను యింతపెద్ద నేరం ఎన్నడూ చెయ్యలేదనిపించింది. 'అల్ప సాంగత్యం ప్రాణసంకటం' అని ఊరక అన్నారా?! కృష్ణా రామా అంటూ వున్న వాణ్ణి చిక్కుల్లో యిరికించాడే వెధవ కుప్పుగాడు? నా అభిప్రాయాన్ని బయటికి కక్కేశాను.

'అంత బుద్ధిమంతుడివైతే వెంట వచ్చావెందుకు? అయినా యిప్పుడేం కొంప మునిగిందని యీ కంగారు? సరకున్న పెట్టెలో మనం ఎక్కొద్దులే,' అన్నాడు.

'కాని ఊళ్ళో దిగ్గానే, స్టేషన్‌నుంచి సరకుని అయ్యర్ యింటికి తీసుకువెళ్ళాలిగా?' అని అడిగాను.

'దానికి సోమూ బృందమే బాధ్యులు. మనకావిషయం పట్టించుకోవాల్సిన ఖర్మలేదు.'

'ఆ చివరిగది ఫూల్స్ ఏంచేస్తున్నారు? కిటికీవద్ద ఎవరైనా ఏడిశారా?'

లైట్లు ఆర్పేసి, చీకట్లో కూర్చుని మేం మాట్లాడుకొంటున్నాం. కుప్పు మెల్లిగా లేచి, పిల్లిలా అడుగులేస్తూ

వెళ్ళి, కిటికీ ద్వారా తొంగిచూసి తిరిగొచ్చాడు.

'కిటికీ బయట ఓ తల కన్పించింది' అన్నాడు రహస్యంగా.

'ఒకడి తర్వాత మరొక్కడు 'పారా' చేస్తున్నార్రోయ్' అంటున్నప్పుడే నాకంఠం పగిలిపోతున్నట్లు అనిపించింది.

ఛా! భయం ఎంత ప్రాణాంతకమైనది?

తప్పకుండా 'రెడ్ హేండెడ్‌గా' పట్టుకు తీర్తారన్న భీతి, నా గుండెల్లో విప్లవం చెలరేగింది, హఠాత్తుగా పెద్ద ధనవంతుడినయ్యే బదులు, పెద్ద మోసగాణ్ణి కాబోతున్నానని దిగులుపడ్డాను. పోలీసులకి చిక్కిన విషయం బయటకి పొక్కితే ఊళ్లోవాళ్లు ఏమనుకుంటారు ? చాలా మంచివాడన్న పేరుంది నాకు. అంచేతేగా తన కూతుర్ని (ఆరువేల ఐదువందల డెబ్బయిఐదు రూపాయల కట్నం ఇచ్చి) నా కిచ్చి పెళ్లిచేశాడు మామయ్య ? దొంగ నోట్ల కేసులో పట్టుబడి, ప్రభుత్వానికి 'గెస్టు'గా వెళ్లినట్టు పత్రికల్లో పడితే నా గతేంకాను ? 'సుప్రసిద్ధ రచయిత రామస్వామి దొంగనోట్ల కేసులో పట్టుబడగా, పదిహేను సంవత్సరాలు కఠినశిక్ష పడింది' అన్నట్టు 'బ్లాక్ క్యాపిటల్స్'లో వేస్తారే పత్రికవాళ్లు ? పరువు సంగతిని అలావుంచి, నా ముసలితల్లి పెళ్లాం బిడ్డల గతేంకాను ? కుప్పుగాడికి ఏ చింతా లేదు. వాడికి వాళ్ల అమ్మా నాన్నా, వుద్యోగంలో వున్న తమ్ముళ్లూ వున్నారు. ఒకవేళ శ్రీ కృష్ణ జన్మస్థానానికి వెళ్లినా కుర్రాడు నిభాయించుకో గలడు. నా సంగతి అట్లా కాదే ? నా కుటుంబానికి నేనేగా దిక్కు ?

'జరిగిందేదో జరిగిపోయింది. ఎందుకీ భయం ? ఆ చివరి గదిలోని బద్మాషులు మమ్మల్నే గమనిస్తున్నారని ఏమిటి రూఢీ ? ఇవన్నీ మనసులోని భయంవల్ల కలిగే భ్రాంతి', అని అడ్వాన్స్‌గా యిచ్చిన పదిహేనువందలు మా మనసుకు ధైర్యం చెప్పింది. కాని వెధవ 'కోతి—మనసు' గంతులేస్తూ మళ్లీ అపాయశంఖొన్ని ఊదింది. దొంగతనానికి కూడా ఎంత గుండెధైర్యం అవసరం ? అమ్మబాబోయ్ ! నాలాగే కుప్పుగాడలా తికమక పడ్డం వాడి వేడి నిట్టూర్పులద్వారా గ్రహించేను,

'ఛా ! ఫూలిష్ పనిజేశాంరా. సొమ్ము యివ్వకుండా వుండి వుంటే మనం కూడా అయ్యర్‌లాగే ఊరెళ్లి వుండొచ్చు' అన్నాడు కుప్పు.

'అయిదుని ఇరవయ్యయిదు చెయ్యాలన్న దురాశ లేకుండావుంటే — మనుషుల్ని చూసి భయపడాల్సిన ఖర్మ వుండేదంట ?...' అన్నాను.

'బుద్ధిమంతుడిలాగా వాగుతున్నావేమిట్రా ?'

'నేను ముందే చెప్పి ఏడ్చాను. ఇలాంటి వ్యవహారాలువద్దు బాబోయని, విన్నావూ...' అన్నాను.

'నువ్వు చెప్పి ఏడ్చినమాట నిజమేగానీ, చివరకు నువ్వూవచ్చి ఏడిశావ్ గదరా సన్నాసీ' అన్నాడు కుప్పు.

మేం యిలా మాటల్తో యుద్ధం సాగిస్తున్నప్పుడే, ఎవరో తలుపు తట్టడం వినిపించింది. భయంవల్ల క్షణానికి రెండుసార్లు మా వూపిరి ఆగిపోతున్నట్లు అనిపించింది. అంచేత తలుపుతట్టడం విన్పించనట్టు 'గప్‌చిప్'గా వూరుకున్నాం.

'సార్...' బయటనుంచి పిల్లికంఠంతో పిలుపు.

'తలుపుతెరిచి చూడ్రా' అన్నాడు కుప్పు.

'ఆ క్రలా హొటల్ టిఫిన్ కడుపులో కెలుకుతోందిరా. నువ్వేతెరు.'

కుప్పగాడు విసుక్కుంటూ లేచి, దీపం వెలిగించకుండా వెళ్లి తలుపు తెరిచాడు. వెంటనే తలుపుల్ని తోసుకొని ఎవరో లోపలికి దూరేసరికి, కడుపునొప్పి పేషంటుని అమాంతంగా లేచి కూర్చున్నాను.

లోపల ప్రవేశించింది ఇబ్రహీం. వాడే తలుపులని లోపలగడియపెట్టి, మాయిద్దర్నీ దగ్గరకులాగి, 'చెవిలో రహస్యం' చెప్పాడు. 'సరకు తంజావూరికి వచ్చినసంగతి పోలీసులకు ఎట్లాగో పొక్కింది. దర్బార్ హొటల్లో పోలీసుల 'చెక్కింగ్' జరుగుతోంది.' అని వాడు అంటున్నప్పుడే, శరీరంలో ఎక్కడో దాక్కున్న ప్రాణం బయటకు పారిపోసాగింది; దాన్నిపట్టి అరచేతిలో పెట్టుకున్నాను.

'సరకు పట్టుబడిందా ?' అడిగాడు కుప్పు.

'మేమంత వెర్రివాళ్లంకాము. వాళ్ల కళ్లల్లో కారంకొట్టి మరోచోటుకి తరలించేశాం. ఎట్లాగైనా రెండున్నరబండికే వచ్చేస్తుంది — లెండి. దేనికైనా మంచిది. కాస్త 'జాగర్తగా' వుండాలి. మీరు రూంను ఖాళీచేసేసి, స్టేషన్‌లో వుండండి. మమ్మల్ని చూసినా, తెలియనట్టే మసలుకోవాలి' అని వచ్చినట్టే రహస్యంగా వెళ్లిపోయాడు ఇబ్రహీం.

క్రలా హోటల్లో చివరిగది భ్రష్టులతో పోలీసువాణ్ని చూశాక — ఇబ్రహీం సరకు సంగతి పోలీసులకు పొక్కినట్టు తెలిశాక, నా ప్రాణం శరీరంలో వుండానికి ఇష్టపడలేదు. ఆ క్షణంలో నా అంతరాత్మ ఒక అద్భుతమైన నిర్ణయానికొచ్చింది. 'మేం ముగ్గురం వాటాదార్లం. చెరో అయిదువందలు నష్టంతోపాటు తప్పించుకుంటేచాలు. ఈ 'అనుక్షణం మరణభయాన్ని' యిహ భరించలేం' అన్నదే నా నిశ్చయం. 'సరకు వచ్చినా రాకపోయినా,






# దొంగనోట్లు

కుప్పుగాడు నాతో అంగీకరించినా అంగీకరించకపోయినా, రెండున్నరబండికి 'సుబ్బరంగా' వూరికివెళ్ళి హాయిగా నిద్రపోవాల్సిందే అని నిశ్చయించుకున్నాను. ఈ నిశ్చయానికి రాగానే నా మనసు కుదుటపడింది. బయటికి వెళ్ళిన ప్రాణం మళ్ళీ శరీరంలోని యధాస్థానానికి చేరింది.

స్టేషన్‌లో టిక్కెట్లు కొన్నాక, చివరి గది ప్రభృతులు అక్కడకూడా మమ్మల్ని వెంటాడివచ్చినదాన్ని చూపించాడు కుప్పు.

'వస్తే మనకేం? మనం దొంగలించబోతున్నామా ఏమిటీ?'

నా మాటల్లోని స్థైర్యాన్ని కుప్పుగాడు అర్థం చేసుకోలేకపోయాడు. రైలెక్కాక మేం ధారాళంగా మాట్లాడుకోగలిగాం.

'నాదో చిన్న అనుమానం. ఈ ఇబ్రహీం, సోముగాడు, ఆ చివరి గదివాళ్ళు—వీళ్ళంతా ఒక్కే ముఠావాళ్ళు. మన్ని మోసంజేసి డబ్బు కాజేశారు. పోలీసు భీతిని చూపించి మన్ని తరమేస్తున్నారు' అన్నాను.

'ఇబ్రహీం అలాంటివాడు కాడు. సోము అట్లా కన్పిస్తున్నాడా?'

'కాసేపాగు. బండి బయల్దేరేలోపల తేలిపోతుందిలే' అన్నాను.

బండి బయల్దేరేలోగా సోముగానీ, ఇబ్రహీంగానీ రారనే నా నమ్మకం. అలా వచ్చినా, నా అయిదువందలూ లాక్కొని, విరమించుకోవాలన్న సంకల్పాన్ని కుప్పుకి చెప్పలేదు. అనుకున్నట్టే వాళ్ళిద్దరూ పత్తాలేరు.

'ప్రొద్దున్నే ఇబ్రహీంను కల్సుకుని అడిగితే...'అన్నాడు కుప్పు.

'నువ్వుండి చూసిరా.'

'నేను మట్టుకా?'

'అబ్బాయ్! ఈ గవర్నమెంటుతో పోటీచేసి, నోట్లు ముద్రించి వ్యాపారం చెయ్యడానికి నాకు సామర్థ్యత లేదు' అన్నాను నవ్వుతూ.

'ఇచ్చిన పైకాన్ని మాత్రమే అడుగుదాం'

'దానికి నువ్వే చాలుగా? నీ ఫ్రెండేగా ఇబ్రహీం?'

ఇంజన్ కూతేసింది. బండి తంజావూరు స్టేషన్ ప్లాట్‌ఫారాన్ని దాటింది. నా (అ)ధర్మఖాతాలో, మనసులో, అయిదువందలకు ఖర్చు రాసేశాను. ●

# వారఫలం

**27-10-1967 శుక్రవారం మొదలు**
**2-11-1967 గురువారం వరకు.**

**మేషం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. ఉద్యోగంలో మాటపట్టింపులు తగవు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలించగలవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:** వృత్తి వ్యాపారాల్లో ఆదాయం కంటే అడపుడి అధికంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాహసంతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగ ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మిధునం.** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అనుకూలంగ ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బంధిని కలిగిస్తుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** వృత్తిలో ప్రయోజనంగలపరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. కొన్ని వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**సింహం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడిన తరువాత సర్దుకుంటాయి. మీ తాలూకు వస్తువులుపోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**తుల:** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సమయానికి యేదోఒక విధంగా డబ్బుచేతికి వస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారల్లోను చికాకులు యేర్పడతాయి. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారాంతంలో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో కాపాల్గొంటారు.

**మకరం:** కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా అది యితరులకు చెడుగానే కన్పిస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాల్లోనే నష్టం వస్తుంది. వారంమధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణించగలదు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో బేధాభిప్రాయాలు వస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం:** అదాయం మాటయెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగ నెరవేరుతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగ ఉంటాయి. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగ ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మీనం:** ఇతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. వ్యాపారంలో పోటివారితో పోటీ పెరుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగ ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

—మహేష్ ●



సీరియల్

## [illegible]

తేజోవతి

### జ రి గి న క థ

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోతుంది. అతని అక్కయ్య జ్యోతికి ఆనందరావుతో వివాహమవుతుంది. ప్రాణస్నేహితు లయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసు కుంటారు. రమణ భర్త వెంకట్రావు. వేణు సుశీలను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు. కాలేజీలో వేణుకు ఉషతో పరిచయ మవుతుంది. జ్యోతి సుశీలను గురించి ఉత్తరం రాసి వేణుకు కర్తవ్యాన్ని జ్ఞాపకం చేస్తుంది. పార్టీ రాజకీయాలకు ఆనందరావు బలైపోతాడు. సుశీల వరదరాజు కూతురని తెలుసుకున్న వేణు వివాహానికి నిరాకరిస్తాడు. శంకరం మాస్టారి సలహాను కూడా లక్ష్యపెట్టడు. వెంకట్రావు జ్యోతి మంచితనాన్ని అర్థం చేసుకుంటాడు.

## 27

ఉష లోపల్నుండి వస్తూనే, 'వేణూ!... నేచెప్పలా...మా డాడీ...చాలా మంచివారని... ఆయనకు నువు బాగానచ్చావుట...నీకు మంచి భవిష్యత్తు కూడా వుందిట అల్లుణ్ణి చేసుకుని మనిద్దరినీ ఫారన్ పంపుతామన్నారు... పైగా నాకు అతడే కొడుకనుకుంటాను... అని కూడా అన్నారు ... ఇప్పుడు చెప్పు ...నిజంగా మాడాడి...' అంటూ వస పిట్టలా మాట్లాడుతూనే వున్న ఉష కుర్చీలో కూర్చుంటూ, వుదాసీనంగా కన్పిస్తున్న వేణును చూసి అప్పటికి గ్రహించింది అతడికి శరీరరుగ్మత కాదు. మానసిక రుగ్మత అని...

'ఏం వేణూ!...ఎందుకలా వున్నావ్?'

'నేను నీతో కొన్ని విషయాలు మాట్లాడుదామని వచ్చాను ఉషా!...' అని చెప్పి, సుశీలతో పరిచయం మొదలు శంకరం మేష్టారు వచ్చి వెళ్ళిందాకా జరిగిన సంగతులన్నీ పూస గుచ్చినట్లు చెప్పాడు వేణు... శంకరంగారిని గురించి వేణు యిదివరలోనే ఉషకు చెప్పేడు...

అంతా చెప్పాక చివరికి, 'ఉషా!...నన్ను ద్రోహి అనుకో...వంచకుడనే అనుకో... ఏమనుకున్నా సరే...నన్ను క్షమించు...నేను ...నేను...సుశీలను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను...'అన్నాడు. అలా అన్నప్పుడు వేణు కళ్లనుండి రెండు కన్నీటి చుక్కలు జారి క్రింద పడ్డాయి...

ఇంతదాకా జీవంలేని బొమ్మలా వింటున్న ఉషలో 'ఫుల్ ఆన్'లో వున్న 'ఫాన్' కంటె వేగంగా తిరుగుతున్నయి ఆలోచనలు...

'అలాంటివాడివి...నన్ను...నన్ను ఎందుకు ఆశలు పెంచుకోనిచ్చావ్?...ఇవ్వాళ యింత నిర్దాక్షిణ్యంగా...యిలా పెరికి వేస్తానంటే...న్యాయంకాదు... ఆడపిల్లల జీవితంతో ఆటలాడుదా మనుకున్నావా?...వేణూ!... ఆలోచించు, బాగా— ఆలోచించు ... నేను ... ప్రొఫెసరుగారి కూతుర్ని...నేను కోరితే మా నాన్నగారు చెయ్యని పని అంటూ లేదు ... నేను తల్చుకుంటే...వేణూ! ... బాగా ఆలోచించు...' కూలిపోయిన తన వూహాల రమ్య హర్మ్యాలను తల్చుకుని బాధతో కోపంతో వూగిపోతున్న ఉష తోక త్రొక్కిన ఆడ త్రాచులా లేచింది...

'క్షమించలేవా ఉషా?' అని అడిగాడు వేణు గద్గద స్వరంతో జాలిగొలిపేలా ...

'క్షమ!... ఎందుకు క్షమించాలి?... ఎలా క్షమించగలను?...ఓహ్! వేణూ!...వెళ్లిపో... నా కళ్లముందు నుండి వెళ్లిపో...' అంది ఏడుస్తూ...

'వెళుతున్నాను ... ఉషాదేవీ!... క్షమించ గలిగితే క్షమించు ... లేదా నీయిష్టం ... నువ్వు చెయ్యగలిగింది చెయ్యి... అవును ... ప్రొఫెసరుగారు మీ తండ్రి...నా భవిష్యత్తు నీ చేతిలో వుంది...కాని ఒక్కటి మాత్రం నిజం ఉషాదేవీ! ... ఇంతదాకా బెదిరించి ఎవ్వరూ నన్ను జయించలేక పొయ్యారు ... వస్తాను... సెలవు' అని చెప్పేసి వెళ్లిపోయాడు వేణు...

వేణు వెళ్లిపోయ్యాక ఉష ఆవేశం కాస్త తగ్గింది...ఉష మనసులో తుఫాను లాంటి అలజడి కాస్త తగ్గాక ... ఎన్నో సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి ఉషకు ... నిజానికి తనే అతడి ఆకర్షణలోపడి కోరి స్నేహం పెంచుకుంది ... స్నేహాన్ని ప్రణయంగా మార్చాలని ప్రయత్నించింది ... ఆనాడు సింహాచలం కొండమీద వేణు అన్న మాటలు చెవులో గింగురు మన్నాయి ఉషకు... 'ఇద్దరు భక్తులు పరస్పర విరుద్ధమైన కోరికలు కోరినప్పుడు పాపం మరి దేముడు ఏం చేస్తాడో...' 'అది కూడా చెప్పాలా?...ఎవరిది న్యాయమైతే...' ఉష చెవులు మూసుకుంది...అవును తనే అర్థం చేసుకోలేక పోయింది!... పెళ్లి చేసుకుంటానని తనకు ఏ నాడూ మాట యివ్వలేదు వేణూ...ఏ నాడూ ఆ చనువు తీసుకుని హద్దులు మీరి ప్రవర్తించలేదు!... ఉషకు యిప్పుడు తెలిసి వచ్చింది ... తను పూర్తిగా అపార్థం చేసుకుందని వేణును ... ఉష వెంటనే లేచి బయల్దేరింది. ఉష స్టేషను చేరేసరికి వేణు హౌరా ఎక్స్‌ప్రెస్ ఎక్కబోతున్నాడు...

'వేణూ!... క్షమించు... వేణూ... ఆవేశంలో ఏమేమో అనేశాను ... తప్పంతా నాదే...నీ ఆకర్షణలో పడి నీ స్నేహాన్ని ప్రేమని అపార్థం చేసుకున్నాను...కానీ... ఒకటి మాత్రం ... నాకు మాట యివ్వు వేణూ!...ఏ నాటికీ... నీ స్నేహాన్ని... నాకు కరువు ... చెయ్యనని ... మాటయివ్వు...' అంటూ గభాలున వేణు చెయ్యి తన చేతిలోకి తీసుకుని ముద్దుపెట్టుకుంది ఉష...

వేణూ కళ్లు గూడా వర్షిస్తున్నాయి... రైలు కదిలింది ... వేణు తలుపు కడ్డీలు పట్టుకుని తలుపు దగ్గర నిలబడ్డాడు... ఉష సజల నయనాలతో అతడి వంకే చూస్తూ, 'నీకు... కావాలంటే... డాడీతో చెప్పి...ఫారన్ పంపడానికి...' ఉష వాక్యం పూర్తికానేలేదు... ఉషను చూసి ఓ పేలవమైన నవ్వునవ్వాడు వేణు...మరుక్షణంలో

రైలు ఉష నుండీ వేణును దూరంగా తీసుకుపోయింది...

*　　　*　　　*

'అరే! మీ యిల్లు యిదేనా? ... నేను యిందాకటినుండీ వెతుకుతున్నాను...'

స్కూలు వేళవుతోందని హడావుడిగా బయలుదేరుతున్న శంకరంగారు వాకిట్లోకి వచ్చేసరికి, చేతిలో 'జర్నీబాగ్'తో రైల్లో తారసపడిన సిల్కు లాల్చీ ఆయన ప్రత్యక్ష మయ్యాడు...శంకరంగారు ఆయన్ను చూసి నిర్ఘాంత పొయ్యారు...ఎక్కడో రైల్లో కొన్నిగంటల పరిచయ మేమిటి? అదీ ఎక్కువగా ఆయన, తనతో మాట్లాడనే లేదు!...ఇవ్వాళ యిల్లు వెతుక్కుంటూ రావడమేమిటి?....

శంకరంగారు మర్యాదగా 'రండి లోపలకు ...ఇదే మా యిల్లు...'అన్నారు...

'మీ శ్రీమతి యింట్లోనే వున్నారు కదండీ?', వచ్చినాయన కూర్చోకుండానే ముందీ ప్రశ్న వేశారు.

'ఆఁ...వున్నదండీ...పార్వతీ?...పార్వతీ!...' అని కేకేశారు యీయనకు తన శ్రీమతితో ఏం పని వచ్చిందా అనుకుంటూ...

పార్వతి వస్తూనే, కుర్చీలో కూర్చున్న సిల్కు లాల్చీ ఆయన్ను చూచి నిశ్చేష్టితురాలైంది...అలాగే గుడ్లప్పగించి చూస్తున్న భార్యతో, 'ఈయన...ఈయన...'పరిచయం చెయ్యడానికి పేరు తెలియక నసుగుతున్నారు శంకరంగారు...

'అవును...ఈయనే...ఈయనే... అప్పటి ...వాచరు...' అంది పార్వతి మెల్లిగా... ఒక్కో సంఘటనతో ఒక్కో వ్యక్తి అలా నిల్చిపోతుంటారు గాబోలు మరిచిపోదామన్నా మరుపు రాకుండా...పార్వతి ఎంత మంది వాచర్నను చూడలేదు?...కానీ ఈయనున్నంత జ్ఞాపకం మరొకరు వుండరు... ఆయన్ను చూడగానే ఆనాడు జరిగిన సంఘటన అంతా కళ్లకు కట్టినట్టయి, నిలువెల్లా వొణికి పోయింది పార్వతి...

'ఏమిటీ?!!...' అన్నారు శంకరంగారు ఆశ్చర్యంగా...

ఇంతలో ఆ సిల్కులాల్చీ ఆయనే కల్పించుకుని, 'అవునండీ...నేనే ఆనాటి వాచరును.. ఆనాడు నేను పడ్డ తొందపాటు వల్లనే ఆవిడ ఆశలన్నీ అడియాసలయాయి...నాది కొంచెం తొందర స్వభావం ... ఆనాడు 'ఏమిటీ ఏర్పాట్లు' అని మా కాలేజి వాళ్ల మీద కోపం వచ్చింది...ఆ కోపం అకారణంగా యీావిడ మీదికి మళ్లింది...నేను చేసిందేమిటో అప్పట్లో తెలియదు నాకు... మొన్న 'ట్రెయిన్'లో తెలుసుకోగలిగాను.. విద్య మీద ఆసక్తిని పెంచటం నా ధర్మం.. విద్య విరక్తిని పెంచడం కాదు ... నా ప్రవర్తన వల్ల ఆవిడకు విద్యమీద ఆసక్తే పోయిందని విని పశ్చాత్తాప పడ్డాను.' అని చెబుతుంటే పార్వతి నిర్విణ్ణురాలై చూస్తోంది.

శంకరంగారు కాస్త తేరుకున్నాడు...,'అబ్బే! ... దేనికైనా మానవులు నిమిత్తమాత్రులు...ఇందులో మీ తప్పేమీలేదు.. ఒక్కో ఘడియ అలాంటిది ... మీరు అంతగా బాధపడవలసింది ఏమీలేదు యిందులో...' అన్నారు...

పార్వతిగారూ!... తప్పో ఒప్పో ..ఆనాటి నా ప్రవర్తనను మీరు మర్చిపోగలిగినట్లయితే...ఇదిగోండి ... ఈ పుస్తకాలు బెనారెస్ హిందూ యూనివర్శిటీ ఎమ్మేవి...మీరు ఎమ్మే తప్పక చదవండి...మీకేమన్నా అనుమానాలొచ్చినా నేను చెబుతాను. ముందు మీరీ పుస్తకాలు తీసుకోండి...' అంటూ



# హరాం సంధ్యా ప్రవర్తతే..

ఆయన 'బాగ్'లోంచి పుస్తకాలు తీసి బయట పెట్టారు.

'అబ్బే!...ఎందుకండీ!...వద్దు. నాకు చదవాలనిలేదు. ఇక చదవలేనుకూడా. దయచేసి వాటిని తీసుకుపొండి, ఒకసారి నీరుకారిపోయిన వుత్సాహం మళ్ళీ ఎన్నటికీ రాదు. ఇకముందు మాత్రం నాలా ఎవ్వరూ బాధపడకుండా వుండడమే నాక్కావలసింది' అన్నది పార్వతి.

'అయితే మీరు నన్ను క్షమించలేదన్న మాట...' అన్నాడాయన బాధగా.

'పార్వతీ!...ఇలా మొండిపట్టు పట్టడం నాకేం బాగుళ్ళేదు...జీవితంలో ఒక్కో సంఘటన, ఒక్కో పాఠం నేర్పుతుంది. అలాంటి వాటిని తట్టుకుని నిలబడడం నేర్చుకోవాలి...ఆటంకాలూ, ఆశాభంగాలూ ఎదురొచ్చేకొద్దీ రెట్టింపుదీక్షతో కృషిచెయ్యాలి... అంతేగానీ...ఆయన యింటికల్లావచ్చి అలా యిస్తున్నప్పుడు, ఆయన మనసు నొప్పించకూడదు.' అని మందలించారు శంకరంగారు.

'పార్వతిగారూ!...మీరు కాదనకండి ... తప్పక చదివి యీసారి 'క్లాసు' తెచ్చుకొండి. ఓ వారంరోజుల్లో నేను 'ఎస్సేస్' కూడా పట్టుకొస్తాను. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!...' అని చెప్పి ఆయన వెళ్ళిపొయ్యారు. ఆయనటు వెళ్ళగానే, 'ఎందుకండీ అవి తీసుకున్నారు?.. ఇప్పుడిక ఏం సాగుతుంది చదువు?' అంది పార్వతి.

'ఏం ఎందుకు సాగదు?' అని ఎదురు ప్రశ్న వేశారు శంకరంగారు. అప్పుడే మంచినీళ్ళబిందెతో లోపలికి వెళ్ళబోతున్న సీతమ్మగారు ఆగి, తమ్ముడువైపు తిరిగి, 'మరో కొద్దినెలల్లో నాకు మేనల్లుడో, మేనగోడలో పుట్టబోతుండె ... చంటిబిడ్డతో చదువేం సాగుతుందని కాబోలు పార్వతి దిగులు!...' అన్నది.

శంకరంగారు ఆశ్చర్యంగా 'ఆఁ...ఏమిటీ!.' అన్నారు. 'నిజమా?' అన్నట్లు పార్వతివైపు చూస్తూ. పార్వతి వాళ్ళమాటలు విని పించుకోనట్లే తలవంచుకుని ఎటో చూస్తోంది సిగ్గుతో...శంకరంగారికి 'ఇది నిజమా? కలా? రఘూబాబు చీకటిచేసిపోయిన తమ జీవితాల్లో కూడా సూర్యోదయ మవడం వుంటుందా?...అనిపించి ఎదురుగా తడికెకు తగిలించివున్న వేంకటేశ్వరుని పటంవైపు చూచారు మనసులోనే నమస్కరిస్తూ. అంతలోనే ఎదురుగా వున్న పుస్తకాలు ఆయనకు చదువుమాట జ్ఞాపకం చేశాయి...వాటివైపు చూస్తూ, 'పార్వతీ! నీ చదువు తల్చుకుంటుంటే నాకు భర్తృహరి పద్యం...'ప్రారంభింపరు...' ఆ పద్యం జ్ఞాపకం వస్తోంది...' అన్నారు చిరునవ్వు నవ్వుతూ.

తమ్ముడన్నదానికి సీతమ్మగారు పార్వతివైపు తిరిగి, 'అయినా—అదేమంత పెద్ద ఆటంకం అమ్మాయి! ... మా శంకరం 'ఎమ్మే ఎమ్మే' అని ఏనాటినుండో అంటున్నాడు...ఆ ఒక్క మెట్టూ, ఎక్కి వాడి ముచ్చట కూడా తీర్చరాదూ. ఎలాగయితే ఉద్యోగం కూడా చెయ్యాలనుకుంటూనే వుంటివి...' అన్నది.

అప్పుడే పూజ ముగించుకుని యివతలకు వస్తున్న సుశీల, వాళ్ళ సంభాషణ విని, 'అవును వదినా...మీరు తప్పక చదవండి ... అనుకున్నది పూర్తి చెయ్యకుండా మధ్యలో ఆపడం నాకూ నచ్చలేదు.' అంది.

పార్వతి ఏమనుకుందో, ఏమో గానీ... 'లేదండీ...నా చదువు ఆగిపోదు ... తప్పక చదువుతాను. మీ కోరిక కూడా సఫలం చెయ్యడానికి ప్రయత్నిస్తాను.' అంది కృతనిశ్చయంతో...వెంటనే ఆ పుస్తకాలన్నీ తీసి బొత్తి పెడుతుంటే సుశీల అన్నీ లోపల పెడుతోంది ... ఇంతలో శే వచ్చారు వరదరాజులుగారూ, సుబ్బులూ...

'ఏం నాన్నా!...నేనిక్కడుంటే ఇంట్లో యిబ్బందిగా లేదూ?... ఇవ్వాళ యింటికి వస్తాను...' అంది సుశీల తండ్రితో... పార్వతి, శంకరంగార్ల ఓదార్పులతో ఓవిధమైన స్థిరత్వం వచ్చేసింది సుశీలకు... సెగలు కక్కే లావాను గర్భంలో దాచుకుని మామూలుగా కన్పించే అగ్నిపర్వతంలా సుశీల బాధను గుండెల్లో దాచుకుని, మామూలుగా తిరుగుతోంది ముసలితండ్రి మనసు యింకా కష్టపెట్టడం ఇష్టంలేక.

'అందుకే వచ్చానమ్మా...ఇంట్లో పిల్లలు గొడవ చేస్తున్నారు అక్కయ్యను పిల్చుకు రమ్మని...సుబ్బులూ! నువ్వు అమ్మాయిని యింటికి తీసుకుపో... నేను యిటు నుండీ స్కూలుకి వెళుతాను... శంకరం! మవు




# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్నచోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకు సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిసి నెలలు తరబడి వస్తుంది. అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

**అమృతాంజన నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.**




అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2818a

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

చేసిన మేలు...' అంటున్న వరదరాజులుగారు వాకిట్లో రిక్షా ఆగిన చప్పుడైతే తిరిగి చూశారు...అందరి కళ్ళూ అప్రయత్నంగా అటే తిరిగినయి...

చేతిలో సూట్‌కేసుతో రిక్షా దిగి లోపలకు వస్తున్నాడు వేణూ!.. అతడు సరాసరి శంకరంగారి దగ్గరకు వచ్చి. 'మేష్టారూ!'... అన్నాడు...

శంకరంగారు మౌనంగా అతడి మొఖంలోకి చూస్తూ వూరుకున్నారు...

'మేష్టారూ !... నేను సుశీలను పెళ్ళి చేసుకుంటానని చెప్పడానికే వచ్చానండి.' అన్నాడు, మేష్టారు పల్కనందుకు బాధగా ఆయన మొఖంలోకి చూస్తూ.

'వేణూ !...' అన్నారు శంకరంగారు... అంతకంటే ఏమనటానికీ తోచలేదాయనకు!

'అవును మేష్టారూ...' అన్నాడు అప్పటికి 'హమ్మయ్య' అనుకున్న వేణూ...

'బాగా ఆలోచించుకునే అంటున్నావా?'

'ఇవాళ్టికి బాగా ఆలోచించుకునే యీ నిర్ణయానికి వచ్చాను మేష్టారూ...'

'ఉన్నట్టుండి నీ నిర్ణయం యెందుకు మారినట్టు ?'

'మీరు వెళ్ళాక ఆ రాత్రంతా ఆలోచించాను మేష్టారూ...ఎప్పుడూ రాని కోపం మీకు వచ్చిందంటే ... నా అభిప్రాయాల్లో ఏదో తప్పు వుండాలనుకుని బాగా ఆలోచించాను... ఈ జన్మలో వరదరాజులుగారి మీద ఏర్పడ్డ భావాలను ఎవ్వరూ చెరిపెయ్యలేకపోవచ్చు... కానీ ఆ మిషమీద నేను మాట యిచ్చిన సుశీలకు ద్రోహం చెయ్యడం న్యాయం కాదనిపించింది...అంతే, ఉషతో చెప్పి వచ్చేశాను...'

ఇంతదాకా మౌనంగా వింటున్న సుశీల శంకరంగారివైపు తిరిగి 'ఎందుకు మేష్టారూ? ఆయన కిష్టమైనవాళ్ళనే ఆయన్ను చేసుకోమనండి...ఆయనకు మీ మీద గౌరవం కొద్దీ వొప్పుకుంటున్నారు... ఒకరి మాట తీసెయ్యలేక నన్ను పెళ్ళిచేసుకోడం నా కిష్టంలేదు మేష్టారూ...వద్దు... నాకా పెళ్ళి వద్దు...' అంది.

'నీమీద అభిమానముంది కాబట్టే యిలా వెతుక్కుంటూ వచ్చాను సుశీలా!... నా జీవితంతో ముడివేసుకున్న సమస్యల్లో, ఒకరి కోసం ఒప్పుకుని జీవితాంతం బాధపడే కీలుబొమ్మగా మార్చలేదు మా మేష్టారు నన్ను...ఏది యుక్తమో, ఏది అయుక్తమో కనీసం ఆలస్యంగా నన్నా గ్రహించగల విచక్షణా జ్ఞానం ఆయన నాకు కలిగించారు. నా నిర్ణయాన్ని నిర్భయంగా అమలులో పెట్టగల ఆత్మవిశ్వాసమూ పెంపొందించారు ఆయన లాంటి వారి అడుగు జాడల్లో వ్యక్తిత్వం సంతరించుకున్నాను. నాకు నేను చేసేపని, మంచిగ అనిపించినప్పుడే, మనస్ఫూర్తిగా యిష్టమైనప్పుడే చేస్తాను సుశీలా...'

'ఒద్దు బావా వొద్దు...నేనుంతా కోరేది మీ సౌఖ్యాన్నే... మీ భవిష్యత్తును పాడు చెయ్యడం నాకిష్టంలేదు మీరు ఆ ప్రొఫెసరుగారి అమ్మాయినే పెళ్ళి చేసుకోండి మీ భార్య ధనంతో విదేశాలకు వెళ్ళి చదువుకోండి. మీరు వృద్ధిలోకి రావడమే మాకూ కావల్సింది... నేను ఏదో చిన్న వుద్యోగం చూసుకుంటాను. బహుశా యిందుకే అయ్యుంటుంది ఆ రోజు పూనికగా మీరు నా చదువు మొదలెట్టించింది!...' అంటూ వెటూర్చింది సుశీల.

'హుం.. నేను నిజంగా డబ్బుకే లొంగే వాడినైతే, 'నీ భవిష్యత్తు నా చేతిలో వుంది బాగా ఆలోచించుకోమని' ఉష బెదిరించినా, తెగించి యింత దూరం వచ్చేవాడినా!...నువ్వు వరదరాజులుగారి కూతురివని తెలియగానే నాకు అసహ్యం వేసింది సుశీలా.. నీకు తెలియదు మీ నాన్న శంకరం మేష్టార్ని నా మూలంగా ఎన్ని కష్టాలపాలు చేశారో?... ఆ ఆవేశంలోనే నిన్ను చేసుకోనని చెప్పేశాను...ఆ తర్వాత అనిపించింది...'మీ నాన్నగారి కక్ష నీ మీద తీర్చుకోడం అవివేకమని ... ఆవేశంలో ఆలోచనలు తప్పుదారి పడితే యిక సరిదిద్దుకునే అవకాశమే లేదా సుశీలా!...ఇప్పుడు నాకు ఎవరి డబ్బుమీదా విదేశాలకు వెళ్ళాలనిలేదు 'గవర్నమెంటు స్కాలర్‌షిప్' వస్తే వెళ్తాను. లేకుంటే యీ చదువు పూర్తికాగానే 'లెక్చరరు జాబ్' చూసుకుంటాను.'

'ఆవేశంలో ఆలోచనలు తప్పుదారి పట్టినప్పుడు సరిదిద్దుకునే అవకాశమే లేదా అని మీరన్నట్లే — మా నాన్నగారి విషయంలో మాత్రం అలా ఎందుకు కాకూడదు బావా?...ఆయన యిదివరలో మీమీద దురభిప్రాయపడితే యిక ఎప్పటికీ ఆ అభిప్రాయమే వుంటుందనుకోడం ఏమంత బాగుంది! ఆయన చేసినదానికి ఆయన పశ్చాత్తాపపడుతున్నప్పుడు మీరుమాత్రం మీ అభిప్రాయాన్ని ఎందుకు మార్చుకోకూడదు?'

వరదరాజులుగారు దగ్గరగా వచ్చి వేణు రెండుచేతులూ పట్టుకున్నారు. 'వేణూ... మొదట్లో నీమీదా, ఈ శంకరంమీద కక్ష గట్టినమాట నిజమే .. ఎన్నో తిప్పలు పెట్టినమాట నిజమే...దానికి ప్రతిఫలం కూడా అనుభవించాను. ఇంత జరిగాక కూడా నాకు కనువిప్పు కాకుండా వుంటుందా వేణూ?'. అన్నారు.

వేణు శంకరంగారివైపుచూశాడు. ఆయన చిరునవ్వు నవ్వారు. 'వరదరాజులుగారూ ... అయిందేదో అయిపోయింది. నాకు కావల్సింది సుశీల. ఇతరులలో నాకు ప్రమేయం లేదు ...కానీ.. ఒక్క విషయం... నాకు పరీక్షలు యిక ఎక్కువ రోజులు లేవు ... మీరు వివాహానికి కొంతకాలం ఆగేట్లయితే నేను పరీక్షలు కాగానే వివాహం చేసుకుంటాను...' అన్నాడు వేణు.

వరదరాజులుగారు ప్రాధేయంగా శంకరంగారివైపు చూశారు. శంకరంగారు సుశీల



వైపు చూసి 'ఏమ్మా? ఏమంటావ్?' అని అడిగారు ..

'మీ యిష్టం మేష్టారూ!...' అంది సుశీల తల వంచుకుని.

'వరదరాజులుగారూ! మా వేణు మా టంటే తప్పేవాడు కాదండీ... కావాలంటే నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోండి'... అన్నది పార్వతి... ఏమంటావ్? అన్నట్లుగా చూశారు శంకరంగారు...

'మీ యిష్టం మేష్టారూ!...' అన్నాడు వేణు తల వంచుకుని.

'వేణూ!...' అంటూ జలజలా కన్నీరు కార్చారు వరదరాజులుగారు. తర్వాత శంకరంగారివైపు తిరిగి, 'మీ మేలు జన్మలో మరువలేను శంకరం' అన్నారు.

'మేష్టారూ!... ఆశీర్వదించండి...ఒకసారి మీరు 'గొప్పవాడివికా' అన్నప్పుడు దానికి అర్థం వేరుగా వూహించుకున్నాను...డిగ్రీలు తెచ్చుకోడం పెద్ద పెద్ద వుద్యోగాలు చేసి ధనం సంపాదించడమే 'గొప్పవాడవడ' మను కున్నాను నిజమైన గొప్పవాడు అనే మాటకు అర్థమేమిటో యిప్పటిప్పుడే తెలుసుకోగల్గుతున్నాను మేష్టారూ!.. మీ అడుగుజాడల్లో సంస్కారమూ, వ్యక్తిత్వమూ వున్న పరిపూర్ణ మానవుడిగా రూపొందమని నన్ను ఆశీర్వదించండి మేష్టారూ..' అంటూ శంకరం మేష్టారికి నమస్కరించాడు వేణు...

'వేణూ!...' అంటూ కౌగలించుకున్నారు శంకరంగారు. ఆ వాత్సల్య సుధా వాహిని కన్నీళ్ల రూపంలో ప్రవహించి వేణును ఆశీర్వదించింది.

'పదండి వరదరాజుగారూ ... వాళ్లమ్మ గారితో మాట్లాడి నిశ్చయతాంబూలాలు పుచ్చుకొద్దాం... పార్వతీ నువ్వు కూడా రా మాతో...' అని ఓ చీటీ వ్రాసి తమ స్కూల్లో యిచ్చిరమ్మని సుబ్బులు కిచ్చారు శంకరంగారు...

'ఇద్దరం యించుమించు ఒక్క యీడు వాళ్లం ... చిన్నప్పుడు యించుమించు యిద్దరం ఒక్క విధంగానే తిరిగాం ... కానీ వేణూ వృద్ధిలోకి రాగలిగాడు ... తనెందుకు రాలేక పొయ్యాడు అని వితర్కించుకుంటున్న సుబ్బులు 'వేణూ! ... కంగ్రాచ్యులేషన్స్...' అంటూ వచ్చి కరచాలనం చేశాడు...

(అయిపోయింది)

# కనీసకోరికలు

– బాలాజీ




భోజనవిలాస్
హోటళ్ళలో
అన్నం అరగటానికి
మందు ఇవ్వాలి!
బాబోయ్
కడుపు
నెప్పి!


సినిమాహాలు
సినిమాహాల్సులో
తలనెప్పిమాత్రలు
ఉచితంగా
ఇవ్వాలి!!


బియ్యం-రాళ్ళూ
విడిగా అమ్మాలి!
బియ్యంలో
రాళ్ళు ఏరే
మరలు కనిపెట్టాలి!


పరీక్షలలో తప్పిన
వారికి మార్కులలో
కన్సెషన్ ఇవ్వాలి!




మల్లన్నమంత్రి రాజ్యానికి కొంత దూరంలో ఒక రాజు ఉన్నాడు. ఆ రాజువద్ద అనేకభాషలను తెలిసి కొన్న పండితుడొకడు ఉన్నాడు. ఆ పండితుడికి యెన్నోభాషలు రావడం వలన 'భాషా చక్రవర్తి' అని బిరుదు ఉంది. ఎవరైనా పండితులు ఆ రాజు వద్దకు వెడితే 'నాకు వచ్చిన భాషలపేర్లైనా కనీసం నీకు తెలియవు. నీవూ ఒక పండితుడివేనా?' అంటూ అవమానం చేశేవాడు భాషా చక్రవర్తి.

ఇలాగ భాషాచక్రవర్తి చేత అవమానాన్ని పొందిన పండితులు కొంత మంది మల్లన్నమంత్రికి యీ విషయాన్ని తెలియజేశారు. 'ఎలాగైనా సరే భాషాచక్రవర్తి గర్వాన్ని అణచాలని' ఆ పండితులు మల్లన్నమంత్రిని కోరేరు.

మల్లన్నమంత్రి 'సరే'నని మారు వేషంలో ఆ రాజుసభలోనికి వెళ్ళి యిలాగ అన్నాడు. 'నేను భాషాసామ్రాట్టును. ప్రపంచంలో నాకు తెలియని భాషలేదు. మీ సభలో భాషాచక్రవర్తి ఉన్నాడని తెలిసి వాదానికి వచ్చేను' ఆ మాటలు విని భాషాచక్రవర్తి వాదానికి అంగీకరించాడు.

మల్లన్నమంత్రి అప్పుడు తమ వాదాన్ని విని తీర్పు చెప్పడానికి న్యాయమూర్తులు ఉండాలని కోరగా, ఆ రాజు ముగ్గురు న్యాయమూర్తులను నియమించాడు. మల్లన్నమంత్రి న్యాయమూర్తులకు వాదపు షరతులను యీ విధంగా తెలియజేశాడు.

'మొట్టమొదట నేనుగాని నా శిష్యుడుగాని యేది చెపితే దానిని భాషా చక్రవర్తి రాయాలి. తరువాత అతను గాని అతని శిష్యుడుగాని యేది చెపితే దాన్ని నేను రాస్తాను. అలాగున మాలో యెవరు చేయలేకపోతే వారు ఓడిపోయినట్లుగా భావించి వారి బిరుదును వదులుకోవాలి.'

న్యాయమూర్తులూ, భాషా చక్రవర్తికూడా ఆ షరతులకు అంగీకరించారు. మల్లన్నమంత్రి అప్పుడు చేతితో సంజ్ఞచేయగానే అతని అనుచరులు నాలుగైదుమాసాల వయస్సుగల ఒక శిశువును సభలోనికి తీసికొనివచ్చారు.

మల్లన్నమంత్రి న్యాయమూర్తుల యెదట భాషాచక్రవర్తితో యిలాగ అన్నాడు. 'ఇతడు నా శిష్యుడు. ఇతను చెప్పింది మీరు రాయాలి' అని ఆ




శిశువును కొంచెం గిల్లగా ఆ శిశువు 'ఉంగా' అంటూ యేడవడం ప్రారంభించాడు.

ఆ యేడ్పును రాయడం యెలాగ? అని నిర్ఘాంతపోయాడు భాషాచక్రవర్తి. మల్లన్న మంత్రి శిష్యుడు. చెప్పినదాన్ని రాయలేకపోయాడు కాబట్టి ఆ పరీక్షలో భాషాచక్రవర్తి ఓడిపోయినట్లుగా న్యాయమూర్తులు నిర్ణయించి అప్పుడు మల్లన్న మంత్రిని పరీక్షచేయవలసినదిగా భాషాచక్రవర్తిని కోరేరు.

భాషాచక్రవర్తి అప్పుడు కొంత ధైర్యాన్ని తెచ్చుకొని ఆ సభలో యెవరికీ కూడా తెలియని జపానుభాషలో మాట్లాడ్డం ప్రారంభించాడు. మల్లన్న మంత్రి ఆ మాటలను జాగ్రత్తగా వింటూ కాగితంమీద తనచేతికి వచ్చిన గీతలను గీశాడు. భాషాచక్రవర్తి దాన్ని చూసి 'తాను మాట్లాడింది జపాను భాష అనీ, భాషాసామ్రాట్టు రాసింది కొక్కిరి గీతలే కాని జపానుభాషకాదనీ వాదించడం ప్రారంభించాడు.

భాషాచక్రవర్తి జపానుభాషలో మాట్లాడినదాన్ని మల్లన్నమంత్రి జ్ఞాపకం ఉంచుకొన్నాడు కాబట్టి ఆ గీతలను చూసి చదువుతున్నట్లుగా నటించి భాషాచక్రవర్తి పలికిన వాక్యాలనే తానుకూడా పలికేడు.

జపానుభాష అక్కడఉన్నవారికి తెలియదు. మల్లన్నమంత్రి తాను రాసిన దాన్ని చదువుతున్నాడు కాబట్టి అతను సరిగ్గానే రాసేడని భావించి న్యాయమూర్తులు భాషాచక్రవర్తి ఓడిపోయినట్లుగా తీర్పు చెప్పేరు.

మల్లన్న మంత్రి అప్పుడు తానెవరైనదీ సభలో తెలియజేసి భాషాచక్రవర్తిని మందలించాడు. అప్పటినుంచి భాషాచక్రవర్తి యెవరినీ అవమానించలేదు.




**(త) సమాన భాగాలు:**

8 లిట్టర్లు పట్టే పాత్రలో నిండుగా పాలు ఉన్నాయి. ఈ పాలను రెండు సరి సమాన భాగాలు చేయాలి. 5 లిట్టర్లు, 3 లిట్టర్లు పట్టే మరో రెండు కాళీపాత్రలు మాత్రమే అందుబాటులో ఉన్నాయి. 8,5, 3 లిట్టర్లు పట్టే ఈ మూడు పాత్రలను మాత్రమే ఉపయోగించి 8లిట్టర్ల పాలను 4 లిట్టర్లు, 4 లిటర్లుగా విడదీయడం ఎట్లా?

* * *




**(చ) అడవి జంతువులు:**

కొన్ని కొన్ని జంతువులు వేళ తప్పకుండా ప్రతిరోజూ ఒకే సమయానికి ఒక చోటికి వస్తూ ఉండడం మనకందరకూ అనుభవమే. పక్షితీర్థం మాట తెలుసుగా. లండనులో ఒక పిల్లి ఉండేదిట. అది ప్రతి శనివారమూ సాయంకాలం 6–30 గంటలవేళ ఒక

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

ఇంటికి వచ్చి, వాళ్లు పెట్టే తిన్ను తిని వెళ్లిపోయేదిట. ఆ పిల్లి ఒక్క శనివారం తప్ప మరే రోజునా అక్కడికి వచ్చేదికాదట. ఎంతో నాగరికుల మనుకునే మనుష్యులే ముఖ్యమైన పనులు చేయవలసినప్పుడు చేయడం మరిచిపోయి నాలుక కరుచుకుంటూ ఉంటారు కదా, అట్లాంటిది జంతువులలో ఇంతటి పరిణతి చెందిన కాల గమన పరిజ్ఞానం ఉండడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఒక అడవిలో కొన్ని రకాల జంతువులు ఈ విధంగా ఆశ్చర్యకరంగా ప్రవర్తించేవిట. ఆ అడవిలో ఒక చోట నిర్మల సరోవరం ఒకటి ఉంది. అక్కడికి నీళ్లు తాగడానికి నాలుగు రకాల అడవి జంతువులు వేళ తప్పకుండా వస్తూ ఉండేవి. లేళ్లు మూడేసిరోజులకొకసారి మధ్యాహ్నం నడినెత్తిని సూర్యుడు ఉన్నప్పుడు ఆ సరస్సుకి వచ్చేవి. చమరీ మృగాలు ఐదేసిరోజులకొకసారి సరిగ్గా అదే వేళని వచ్చేవి. ఖడ్గమృగాలు ఏడేసిరోజులకొకసారి అదేవేళకు వచ్చేవి. ఏనుగులు తొమ్మిదేసి రోజులకొకసారి అదేవేళకు వచ్చేవి. అవి అన్ని కలిసి ఒక్కచోట గుమిగూడి భయం లేకుండా నీళ్లు తాగుతూఉంటే, ఏనుగులు తొండాలతో నీళ్లు పీల్చి సరదాకి జంతువులమీదా చిమ్ముతూ ఉంటే ఆదృశ్యం ముచ్చటగా ఉంటుందని ఆ అడవిలో ఉండే కోయలు చెప్తూ ఉంటారు. అటువంటి దృశ్యం చూడాలని ఆ దేశపు రాజుగారికి చాలా ముచ్చట అయింది.

'మొన్న పున్నమికి నాలుగురకాల జంతువులూ కలుసుకుని ఆటలాడేయి. రెండురోజులు ముందరగా వస్తే చూడడానికి వీలు అయేది' అన్నాడు కోయపెద్ద రాజుతో మళ్లీ అన్నీ ఎప్పుడు కలుసుకుంటాయో తెలుసుకోవాలనుకున్నాడు రాజు.

మీకు తెలిస్తే చెప్పండి.

* * *



**(ట) ఐదురంగుల బిళ్లలు:**

ఎరుపు, నీలి, పసుపు, తెలుపు, ఆకు పచ్చ రంగుల బిళ్లలు రకానికి ఐదేసి చొప్పున ఉన్నాయి. ప్రతి రంగు బిళ్లల మీద 1,2,3,4,5 అని అంకెలు వేసి ఉన్నాయి. వాటిని ఇక్కడి బొమ్మలో చూపిన $5 \times 5 = 25$ గళ్ల చదరంలో చూపించాను.

| | | | | |
|---|---|---|---|---|
| ఎ$_1$ | నీ$_1$ | ప$_1$ | తె$_1$ | ఆ$_1$ |
| ఎ$_2$ | నీ$_2$ | ప$_2$ | తె$_2$ | ఆ$_2$ |
| ఎ$_3$ | నీ$_3$ | ప$_3$ | తె$_3$ | ఆ$_3$ |
| ఎ$_4$ | నీ$_4$ | ప$_4$ | తె$_4$ | ఆ$_4$ |
| ఎ$_5$ | నీ$_5$ | ప$_5$ | తె$_5$ | ఆ$_5$ |

ఇప్పుడు చేయవలసిన దేమిటంటే: అడ్డవరుసల్లోనూ, నిలువు వరుసల్లోనూ, ఏటవాలు వరుసల్లోనూ ఒకే రంగుబిళ్లగాని, ఒకే అంకె ఉన్న బిళ్లగాని ఒక్కసారి మాత్రమే కనబడేలా ఈ 25 బిళ్లలనూ ఈ చదరంలోని 25 గళ్లల్లోనూ అమర్చాలి.

అది ఎల్లా సాధ్యమో చూపించండి.

* * *

**(త) మంత్రులు—శకటు:**

చదరంగం బల్లమీద ఇక్కడి బొమ్మలో చూపినట్లు నలుగురు మంత్రులనూ, ఒక ఏనుగునూ ఉంచితే ఈ ఐదూ కలిసి బల్ల మీది అన్ని గదులనూ కాపలా కాస్తాయి.

ఇప్పుడు ఏనుగుని తీసేసి, దాని స్థానంలో ఒక శకటుని ఉంచి, మంత్రుల స్థానాలను అవసరమైన విధంగా మార్చి, బల్లమీది


ORWO





# మెదడుకి మేత



## మంత్రులు శకటులు

అన్ని గదులనూ కాపలా కాచేటట్లు చేయడం ఎల్లాగ?



* * *

### జవాబులు

(క) 8లిట్టర్ల పాత్రలో ఉన్న పాలను 5 లిట్టర్ల పాత్రలోకి నిండుగా పొయ్యాలి. అప్పుడు 8 లి. పాత్రలో 3 లి. పాలు మిగులుతాయి.

తరువాత 5 లి. పాత్రలోనుంచి పాలు 3 లి. పాత్రలోకి నిండుగా పొయ్యాలి.

తరువాత 3 లి. పాత్రలోని పాలను 8 లి. పాత్రలోకి వంపెయ్యాలి. అప్పుడు 8 లి. పాత్రలో 6 లి. పాలు, 5 లి. పాత్రలో 2 లి. పాలు ఉంటాయి.

తరువాత 5లి. పాత్రలోని పాలు 3లి. పాత్రలో పొయ్యాలి.

తరువాత 8లి. పాత్రలోని పాలు 5లి. పాత్రలోకి నిండుగా వంపాలి అప్పుడు 8లి. పాత్రలో 1లి. మిగులుతుంది.

తరువాత 5లి. పాత్రలో నిండుగా ఉన్న పాలను 3 లిట్టర్ల పాత్ర నిండేటట్లు పొయ్యాలి దానితో 5లి పాత్రలో 4లిట్టర్ల పాలు, 8లి. పాత్రలో 1లి పాలు, 3లి. పాత్రలో నిండుగానూ పాలు ఉంటాయి.

ఇప్పుడు 3లి పాత్రలోని పాలను 8లి పాత్రలో వంపాలి దానితో 8లి పాత్రలో 4 లిట్టర్లపాలు, 5లి. పాత్రలో 4లి. పాలు ఉంటాయి.

ఈ విధంగా 7 మార్పులతో పాలను సమాన భాగాలుగా విడదీయవచ్చు.

ఇంత పొడుగ్గా వ్రాయడానికి బదులు ఈ క్రింది పద్ధతిలో హ్రస్వరూపంలో వ్రాయవచ్చు.

ఏ పాత్ర నుంచి ఏ పాత్రలోకి పాలు పంపబడ్డాయో బాణపు గుర్తులతో చూపించాను.

* * *

| 8లిట్టర్ల పాత్రలలో | 8 | 3 | 3 | 6 | 6 | 1 | 1 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 5లిట్టర్ల పాత్రలలో | 0 | 5 | 2 | 2 | 0 | 5 | 4 | 4 |
| 3లిట్టర్ల పాత్రలలో | 0 | 0 | 3 | 0 | 2 | 2 | 3 | 0 |




ఈమధ్య నాకు బొత్తిగా ఒంట్లో బాగుండటంలేదండీ రాత్రి నించి మరీను. కళ్ళంతా పచ్చేసి నట్టుంటుంది. విదాహం. ఆకలి. తల్నొప్పి తింటే ఏమీ సయించదు. అలాగని ఎంగిలి పట్టం మానలేదు ఏనాటో పిచ్చెను. తల తిరగటం. అన్నం తినగానే మత్తుగా వుండటం. నిద్ర బాగానే పడుతూందనుకోండి. లేవగానే కళ్ళు ఎర్రబడటం, మంటలు. ఫీవరు పైకి లేదనుకోండి లోపల ఉందిస్మండి. అయితే మీకు టెంపరేచరు దొరకదు. దొంగ జ్వరమో యేమో. ఇంటర్వల్గ వుంటుంది. ఇదీ సంగతి.

ఇక వీడు మా పెద్దాడు. వీడికి రొంప దగ్గున్నూ. గొంతుకనొప్పని ఒహటే గోల. రాత్రి తెల్లవార్లు మూసిన కన్ను తెరవలేదు.

ఇదుగో, వీడు రెండోవాడు వీడికి ఏంతిన్నా పడదు. విరోచనాలు. అలాగని నోరు కట్టడు. అడ్డమయిన గడ్డీ తింటాడు. వద్దురా అని ఎంత చెప్పినా వినడు.

మా ఆవిడకి కాళ్ళపీకు, గుండెనొప్పి, నీరసం, రక్తపోటూ, షుగరు. అస్తమానం కాళ్ళకి గుడ్డలు చుట్టుకు పడుకుంటుంది.

ఈ రోగాలతో యింట్లో పొయిలో పిల్లి లేవలేదండి?—

దీనికితోడు ఇంటికి చుట్టపావిడ ఒకావిడ వచ్చింది. ఆవిడకి ఉబ్బసం లాగుంది. ఊపిరాని ఆయాస పడుతూ ఏకోళ్ళో అన్నట్టుగా వుంది......... మీరోసారి వచ్చి చూడాలి.

ఇదిగోనండి. ఈ కన్ను చూశారా— నీరు కారుతూంది. పనిలో పని కాస్త ఏదేనా డ్రాప్సు ఉంటే వేసిపెడుదురూ.

అన్నట్టు మీ దగ్గిర పళ్ళటించరుందా?— నొప్పెట్టేస్తోందండి బాబూ, మొన్నటినించీ ఈ దంతం ఒకే సలుపు

మా చిన్నవెధవ ఆడుకుందుకని వెళ్ళి బోర్లా పడ్డాడు. మోకాళ్ళు కొట్టుక పోయాయి. కాస్త దూది పిసరూ, బేండేజీ, ఇంతే ఇంత బెంజైను ఇస్తిద్దురూ, చేతులో వుంచుకుంటాను,

అవునుగాని డాక్టరుగారూ.— అడగటం మరిచా, మా పెద్దమ్మాయి నీళ్ళాడి మూణ్ణెల్లయింది. ఇంకా బాగా కోలుకోలే అమ్మాయిని పంపమని అల్లుడు ఉత్తరమీద ఉత్తరం వేస్తున్నాడు ఏదేనా టానిక్కు రాసివ్వాలి. ఎందుకేనా మంచిదని అందాకా అభ్రకమూ, ప్రవాళం కలిపి చ్యవనప్రాశ పుచ్చుకోమన్నా. మందిదే నంటారా?— మా మావగారు గొప్ప నేటివ్ డాక్టర్లెండి. ఆయన హస్తవాసివుంది చూశారూ?— అమోఘం.— ఆయన చేతిలో రేఖలు చూసే, వాళ్ళ నాన్నగారయన్ని వైద్యంలో పెట్టాడు. పోయినై, ఆ రోజులు.— మళ్ళీ అటువంటి వైద్యుడు ఇంతవరకు లేడు.

ఆఁ — డాక్టరుగారూ!— మా ముసలమ్మ ఏమయిందో— ఏమిటో. అర్జంటుగా తీసుకు రమ్మంటే ఈ వేళయింది. మరి లేస్తారా?— సరి, చూసి వచ్చేద్దురుగాని ఇప్పుడే—

## మెదడుకి మేత

(వ) 3,5,7,9 అనే— సంఖ్యలకు కనిష్ఠ సామాన్య గుణకం 315. కనుక, 315 రోజుల కొక్కొక్కసారి నాలుగు రకాల జంతువులూ సరస్సు దగ్గర కలుసుకుంటాయి.

* * *

(శ) ఒకే రంగుకాని ఒకే అంకెకాని ?

| ఎ$_1$ | నీ$_2$ | ప$_3$ | తె$_4$ | ఆ$_5$ |
|---|---|---|---|---|
| ప$_4$ | తె$_5$ | ఆ$_1$ | ఎ$_2$ | నీ$_3$ |
| ఆ$_2$ | ఎ$_3$ | నీ$_4$ | ప$_5$ | తె$_1$ |
| నీ$_5$ | ప$_1$ | తె$_2$ | ఆ$_3$ | ఎ$_4$ |
| తె$_3$ | ఆ$_4$ | ఎ$_5$ | నీ$_1$ | ప$_2$ |

వరుసలోనూ ఒకటి కన్న ఎక్కువసార్లు రాకుండా ఇక్కడ చూపినట్లు అమర్చవచ్చు.

* * *

(ష) నాలుగు మంత్రులుగా, ఒక శకటును ఇక్కడి బొమ్మలో చూపినట్లు అమర్చితే



బల్లమీది అన్ని గదులకూ కావలా ఉంటుంది. ●

ఒకవారం విపరీతం

# హత్యకి, ఘర్షణకి దారితీసిన వివాహం!

కాంగ్రెసు వారమ్మాయిని పెళ్ళి చేసుకొన్నందుకు ద్రావిడ మున్నేట్ర కజగానికి చెందిన ఒకవ్యక్తిని కాంగ్రెసుకు చెందిన వ్యక్తులు మొన్న 9 తేదీన చంపేశారు. దాంతో మద్రాసులో డి. యం. కె. వాళ్ళూ, కాంగ్రెసువారూ ఘర్షణపడ్డారు. ఫలితం ఓ ఆరుగురు కాంగ్రెసువారు తీవ్రంగా గాయపడ్డారు.

* * *

కలకత్తాలో ఓ పదమూడేళ్ళమ్మాయి మొన్న తొమ్మిదో తేదీన నాలుగు కాళ్ళూ, నాలుగు చేతులూ వున్న ఒక శిశువును ప్రసవించిందట. అయితే ఆ శిశువు పుట్టిన వెంటనే మరణించింది. ఇలాటి శిశువుల పుట్టుకలు చాలా విన్నాం. ఎటొచ్చీ బ్రతికి బట్టకట్టిన కేసొకటీ లేదు. బ్రతికితే ఆవ్యక్తి దేశానికే ఒక వింత.

## వొళ్ళుకాలింది- ఫిడేలు దక్కింది!

న్యూయార్కులో తన యింటిలో మంటల నుంచి తన ఫిడేలును రక్షించుకోడానికి సాహసించి డెబ్బయొక్క సంవత్సరాల వయస్సున్న నోవికి అనే ఆయన మంటల్లోకి దూకాడట. ఆయన ప్రఖ్యాత వయొలిన్ విద్వాంసుడు. ఆయన శరీరమంతా కాలిపోయిందట గాని, ఫిడేలు మాత్రం చెక్కు చెదరలేదట.

* * *

తండ్రి సంపాదించి పోయిన పది మిలియను డాలర్ల డబ్బును ఎలా ఖర్చు చేయాలో తెలియక టామీమాన్‌విల్లీ అనే ఆయన తన డెబ్బయిమూడో ఏట నాటికి పదకొండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడట. వివాహాలకూ, విడాకులకు, యితర ఖర్చులకూ చేర్చి ఒకటింపావు మిలియన్లే ఖర్చు అయ్యాయట. ఆయన చేసుకున్న వివాహాల్లో ఒక వివాహం ఏడు గంటల నలభై అయిదు నిముషాల్లో విడాకుల సంబరంగా మారిందట? మొన్న ఆయన చనిపోయే నాటికి భార్య అదృష్టవతి (పేరు[illegible]) ఆస్తంతటికీ వారసురాలయ్యిందట.

## నీటి అడుగున పెళ్ళి

8వ తేదీన లాస్ ఏంజలిస్‌లో '[illegible]' లో ఒక యిద్దరు వివాహం చేసుకున్నారు. నీటిలో మునగడానికి వీలయ్యే దుస్తులు ధరించి ఆ యిద్దరూ నీటి అడుగు భాగానికి వెళ్ళి అక్కడే వివాహం చేసుకున్నారు. యునైటెడ్‌స్టేట్స్ (అమెరికా) లో యింతకు ముందోసారి పారాషూట్‌లలో దిగుతూ వో యిద్దరు మార్గమధ్యంలోనే వివాహం చేసుకున్నారని, యీ రకం 'నీటిలో పెళ్ళి' యిదే మొదటిదని ఆ దేశం పత్రికలు రాశాయి. ఆనాటివారు **హనీమూన్‌కి ఎక్కడెక్కడికో పోతే— ఈనాటి వారు** నేరుగా మూన్‌కే పోతారేమో! పోవచ్చు కూడా.

* * *

లూథియానాలో 8వ తేదీన కాలేజీ నుంచి యింటికి వెళుతున్న సంతోష్ కుమారి అనే ఆమె మీద ఎవరో యాసిడ్ పోశారట. ఆ అగంతకుడు ఒక ఫ్యాక్టరీలో కార్మికుడట. ఆమెను పాపం ఆసుపత్రిలో చేర్చారు.

* * *

నాగ్‌పూర్‌లో యీనెల నాలుగో తేదీన జాలివేపూర్ అనే గ్రామం మీద దాడిచేసి, దోపిడీ చేసుకుంటున్న బందిపోట్లను ఎదిరించి, ఆవూరి ప్రజలు వో యిద్దరు బందిపోట్లను చంపేశారు. ధైర్యం మానవుల్లో నిద్రపోతున్న శక్తి. అది మేల్కొంటే!

* * *

వద్దన్న పని చెయ్యడం అనాదిగా మానవునికి అలవాటే: త్రాగవద్దు— త్రాగుతాం. ఫలానాది, చెయ్యవద్దు— చేస్తాం. ఇవన్నీ జరుగుతూనే వున్నాయి. అయితే యీ మధ్యన స్మగ్లింగ్ ఎక్కువయ్యింది. 12 తేదీన బొంబాయిలో 90 లక్షల ఖరీదు చేసే బంగారాన్ని పట్టుకున్నారు. ఒక వోడలోంచి దింపుతున్న సరుకులలో యీ బంగారం దొరికిందట. వీటి మీద బ్రిటిష్ గుర్తులూ, ఫ్రెంచి గుర్తులూ వున్నాయని అన్నారు. గత సంవత్సరం నవంబరు నుంచీ నేటివరకూ పట్టుబడ్డ బంగారం 4 కోట్ల రూపాయలకిమ్మత్తుట— అదీ గమ్మత్తు.

## ఫోన్ లకి ఫోనులు- వారానికి 6 వేలడాలర్లు!

హాలీవుడ్ తార షెర్లీ మెక్లీన్ సంవత్సరానికి రెండు లక్షల డాలర్లు దేశాలు తిరగడానికి ఖర్చు పెడుతుందట. ఈవిడ చాలాసార్లు ఇండియా కూడా వచ్చింది. వారానికి ఆరువేల డాలర్లు తన స్నేహితులకు ఫోనులు చెయ్యడానికి ఖర్చు చేస్తుందట. ఈ డబ్బుతో ఇండియాలో వో ప్రాంతం బ్రతకవచ్చేమో!

* * *

మైసూరు మహారాష్ట్ర ప్రదేశాల సరిహద్దు తగువుల్లో కొల్హాపూర్‌లో రేగిన అలజడిని అణచడం ఒక సమస్య అయ్యింది. [illegible] నిషేధించి అనుమానించిన వారినందరినీ అరెస్టు చేయసాగారట. అప్పటికి [illegible] మందిని అరెస్టు చేశారు.

* * *

దుష్టుడు దుర్యోధనుడు— అయితే ఉత్తరకాశికి సమీపంలో జమున లోయ ప్రాంతంలో దుర్యోధనుడు ఆరాధ్య దైవమట. గుళ్ళు కూడా వున్నాయట. [illegible] యీ దేవాలయానికి వెనక్కి నడుస్తూ వస్తారట. అంటే వీపులు దుర్యోధనుని విగ్రహం వైపుకు వుండేలా నడిచి వస్తారట— ఇది వింత కాదూ! ఎందుకన్నారా?

* * *

కలకత్తాలో పదో తేదీన గ్రీష్ ఎవెన్యూ ప్రాంతంలో ఒక కారు యిద్దరు కుర్రాళ్ళను గుద్దిందన్న కోపంతో ఆ కారుకు నిప్పెట్టి భస్మం చేశారు— ఎవరు? కలకత్తావాసులు.

* * *

మద్రాసులో సోది చెప్తాం అంటూ వో యిద్దరు ఆడవాళ్ళు కొంతమంది గృహిణులను ఆకట్టి, ఆనక భయపెట్టి "మీ నగలు పూజలో వెయ్యండి" అని బలాత్కరించారట. పోలీసులు సోదివాళ్ళను అరెస్టు చేశారు.

## నివురుగప్పిన నిప్పు

పదో తేదీన హిందీ మీద నిరసనగా సేలంలో గవర్నమెంటు కాలేజీ విద్యార్థులు కాలేజీకి హాజరవలేదు. హిందీ నిప్పు యింకా చల్లారలేదు. ఎటొచ్చీ నివురుగప్పి వుంది అంతే!!

—ఫాలాక్షుడు.



## చిత్రలహరి

### మహిళల నిర్వహణలో "చిన్నారి మనసులు," —సావిత్రి దర్శకత్వం!

కొందరు మహిళలుకలసి 'శ్రీ మాతా ఫిలిమ్స్ (ప్రై) లిమిటెడ్' అనే చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించారు. ఇందులో భాగస్వాములు, డైరెక్టర్లు అంతా ఆడవాళ్లే! ఈ డైరెక్టర్ల బోర్డులో పది మంది మహిళలున్నారు. ఈ బోర్డుకి ప్రసిద్ధ నటి శ్రీమతి సావిత్రి ఛైర్మన్. శ్రీమతి వి. సరోజిని (డైరెక్టరు వి. మధుసూదనరావు గారి భార్య) మేనేజింగ్ డైరెక్టర్.

దసరానాడు ప్రారంభించిన యీ 'చిన్నారి మనసులు' చిత్రానికి శ్రీమతి సావిత్రి దర్శకత్వం వహిస్తున్నారు. స్క్రీన్‌ప్లే కూడా ఆమే సమకూర్చారు. కథ శ్రీమతి వి. సరోజిని రాశారు. ఈ 12 వ తేదీ ఉదయం 7-30 గంటలకు వాహినీలో ముహూర్తం. జెమినీగణేశ్ క్లాప్, ఆదుర్తి సుబ్బారావు కెమెరా స్విచ్ ఆన్, వి. మధుసూధనరావు యీ సంస్థ చిహ్నాన్ని పూలమాలతో అలంకరించటం చేస్తారు. అవాళే మూడు పాటల రికార్డింగు జరుగుతుంది. నేపథ్యగాయని పి. లీల సంగీత దర్శకురాలు. కుమారి మోహన కళా దర్శకత్వం, రాజసులోచన నృత్యదర్శకత్వం వహిస్తారు ముళ్లపూడి వెంకటరమణ సంభాషణల రచయిత.

ఈ చిత్రంలో శ్రీమతి సావిత్రినటించరు

ఈ చిత్రంలో వచ్చే లాభాల్లో కొంత భాగం పరిశ్రమనుంచి రిటైరై సఫర్ అవుతున్న వృద్ధతారలకి యివ్వబడుతుంది

### సి. పుల్లయ్య అస్తమయం!

కొద్దికాలంగా అస్వస్థులుగా ఉంటున్న దర్శక పితామహ శ్రీ సి. పుల్లయ్య యీ నెల మొదటి తేదిరాత్రి పదకొండు తర్వాత కాకినాడ ప్రభుత్వ ఆసుపత్రిలో కన్నుమూశారు. కాకినాడలోను, కొల్హాపూర్‌లోను, కలకత్తాలోను ఆదిలో ఆయన తెలుగు చిత్రాలను తీశారు. రేలంగి వెంకట్రామయ్య, కృష్ణవేణి లాంటి ఎందరో తారల్ని వెండితెరకి పరిచయంచేశారు. చివరిసారిగా శ్రీ పుల్లయ్య 'గొల్లభామ' చిత్రానికి దర్శకత్వం వహించారు. నాడు వచ్చిన గొల్లభామకీ ఆయనే దర్శకులు. చిత్ర నిర్మాణంమీదకన్న థియేటర్ల నిర్మాణంమీద ఆయన ఎక్కువ మోజు కనపర్చేవారు. 'నాకు ఎగ్జిబిటర్ గా ఉండటమంటేనే ఎక్కువ యిష్టం' అని శ్రీ పుల్లయ్య ఒకసారి గొల్లభామ సెట్సులో నాతో స్పష్టం చేశారు. మరణించేనాటికి వీరి వయసు 70 సంవత్సరాలు. ఒక కుమార్తె, కుమారుడు ఉన్నారు. కొడుకు కూడా తండ్రి అంత ఘనుడు. ఆయన్ని డైరెక్టర్ సి. యస్. రావుగా మీరంతా ఎరుగుదురు.

—మోహన్‌కుమార్



నాట్యంలో ప్రవేశం, నేర్పు

# నటి విజయ నిర్మల

'మా అమ్మాయి తెలుపు దాని రంగుకి సరిపడిన అల్లుడికోసం ఎంతగానో వెతికాం. ఆఖరికి దొరికాడనుకోండి పెళ్లి చేశాం. ఇపుడు మా అమ్మాయికి నలుగురు పిల్లలు' అన్నది విజయ నిర్మల, యీ మధ్య గోల్డెన్ స్టూడియోలో ఎం వి ఆర్ పిక్చర్స్ సెట్స్‌లో కలిసినపుడు.

'మీ అమ్మా యేమిటి, పిల్లలేమిటి?' అన్నాను ఆమెవంక ఆశ్చర్యంగా చూస్తూ 'అవునండీ, అమ్మాయిపేరు బన్నీ అల్లుడు పేరు ఫన్నీ.' అన్నది మళ్లీ 'నాకేం బోధ పడలేదు' 'ఈ పేర్లు వింటుంటే మీకు ఫన్నీగా వుందికదూ? మాఅమ్మాయి అంటే నేను ముద్దుగా పెంచుకుంటున్న కుందేలు' అంటూ ఆ చిక్కును విడదీసి నిండుగా నవ్వింది విజయనిర్మల

కొందరు తారలు కుక్కల్ని గారాబంగా పెంచుకుంటుంటే యీమె కుందేళ్ళనీ, పిట్టల్నీ పెంచుతున్నది వాటిని పెంచటం అన్నా, వాటితో ఆడుకోవటం అన్నా యీ అమ్మాయి కెంతో సరదా. అందచందాలతో పాటు సంస్కారం, నమ్రత కలిగిన విజయ నిర్మలది సాధు స్వభావం ... అందువల్లనే సాధు జంతువులపట్ల అభిమానం ఏర్పడింది కాబోలు

*    *    *

మద్రాసులోనే పుట్టి పెరిగిన యీమె 'అసలుపేరు నిర్మల ఎదిగిన తర్వాత మొదటి సారిగా 'విజయ'వారి తమిళచిత్రంలో నటించింది గనుక విజయానిర్మల అయింది ఈ సంవత్సరం ఆరంభంలో విడుదలయిన 'రంగుల రాట్నం' చిత్రంద్వారా ఆంధ్ర ప్రేక్షకు లందరికీ పరిచితురాలయిన విజయ నిర్మల యివాళ బిజీ తార.



సాధు స్వభావం.

'సాక్షి'లో నాయిక అయింది. ఆర్థికంగా ఆ చిత్రం అంత విజయవంతం కాకపోయినా, యీ అమ్మాయి మంచి పేరే తెచ్చుకున్నది. చక్కని నటిగా పలువురిచేత గుర్తించబడ్డది. ఇప్పటిదాకా ఆమె నటించిన చిత్రాలలో తెలుగు అయిదూ, తమిళం రెండూ, మళయాళం ఆరూ విడుదలయినవి మళయాళ



అందచందాలతో పాటు సంస్కారం

రంగంలోనూ మంచినటిగా పేరు సంపాయించుకుంది. నాట్యంలో కూడా విజయ నిర్మలకు ప్రవేశమూ, అద్భుతమయిన నేర్పూ ఉన్నవి.

ఇపుడు పూలరంగడు, మధుపిక్చర్స్, ఎం. వి ఆర్ పిక్చర్స్, బి ఆర్ ఫిలిమ్స్, ఆలయ ఫిలిమ్స్, రవీంద్ర ఆర్ట్‌పిక్చర్స్, అత్తగారు — కొత్తకోడలు తెలుగు చిత్రాల్లోను, రెండు తమిళ చిత్రాల్లోను, ఏడు మళయాళ చిత్రాల్లోను నటిస్తున్నది విజయ నిర్మల నటనలో యింకా డెంతో కృషిచేస్తున్నది ఉత్తమనటిగా రాణించి, తారాపథంలో ఉన్నత శిఖరాల నధిరోహించాలనే ఆకాంక్ష ఆమెలో వున్నది 'అందుకే యీ నిర్విరామ పరిశ్రమ!' అంటుందామె

—మోహన్‌కుమార్



ఎం. శేషాచలం అండ్ కో వారు ప్రచురించిన ఎమెస్కో పాకెట్ బుక్స్‌ని ఆవిష్కరిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి. పార్ట్నర్, కార్యదర్శి శ్రీ ఎం. ఎన్. రవ్, మేనేజర్ శ్రీ కె. జి. కృష్ణమూర్తి లను కూడా చిత్రంలో చూడవచ్చు

## ధన మూలాల మిదం...

(17–వ పేజీ తరువాయి)

రోజు ఖర్చు మొత్తం అంచనా వేసి చూసి ఊరుకోవడం రెండోది — ఈ మనిషెందు కింత లెక్కలకై పాటుపడుతున్నాడన్నది ఓ క్షణం సేపు గృహిణి ఆలోచించి- అతని తత్వానికి బాధపడడం మానేయాలి లేదా తన స్త్రీత్వం కొత్త తొడుగు తొడిగించి 'ఫరవాలేదు, యింకో రెండు రూపాయిలు తీసి ఖర్చు చేసుకో' అనేలా అనిపించాలి అంతే

ఇంటి పని నుంచి భార్య దృష్టిని, ఆఫీసు పని నుండి భర్త దృష్టిని మళ్ళించడానికి హాబీలు కావాలి భార్యకి భర్త భర్తకి భార్య కంటె మించిన హాబీలు ఏముంటాయి? అనేర్పు భార్య ప్రదర్శించడం ప్రారంభించిన నాడు సాయంత్రం పూట నయాపైసాలు బాలెన్సు చేసే తలనొప్పి పనికి స్వస్తిచెప్పి భర్త భార్యని అలా షికారు కేనా తీసుకు వెడతాడు. భార్య అలా సరదాగా కూర్చుని కబుర్లు చెప్తూ భర్త కిష్టమైన ఏ కాకరకాయ వేపుడైనా చేస్తుంది. ధన మూలం మిదం జగత్ అన్నారేగాని ధనమూలం మిదం జీవితం అనలేదుగా జీవితంలో ధనానికి మించిన సున్నితమైనవి ఎన్నో ఉంటాయి. అవి మనని వెతుక్కుంటూ రావు మనం వాటిని వలేసి పట్టాలి ●

## ఉత్తరాలు

(–4వ పేజీ తరువాయి)

వ్రాసినట్లు "రైలు పట్టాల ప్రేమ"ను ఈ నవలలో స్ఫురించలేకపోయాను

ఈ నవలలోని పాత్రలు — అన్నీ చిత్త ప్రవృత్తులతో కోర్కెలతో, బలహీనతలతో ఎగుడు దిగుడుగా కనిపించే సామాన్య మానవుల భౌతిక ఆకారాల నీడలు. అంతేకానీ ఒక ఆశయానికి, నీతికి కట్టుబడి, ఒక సంస్కృతికి ప్రతినిధిగా ఉద్దేశ్యపూర్వకంగా కల్పించబడిన వ్యూహ జనితమైన పరిపూర్ణ మానవులు కారు.

ఈ దృక్పథంతో నవలను విమర్శించి, సహేతుకమైన ఉత్తరాలను వ్రాయవలసినదిగా కోరుతున్నాను. మరొక విషయం రచయిత తెలుగు సినిమా ప్రేక్షకుల స్థాయిక్కన్న అధ్వాన్నంగా తెలుగు సాహిత్యాభిమానుల స్థాయి దిగజారిపోయిందనే వ్యాఖ్యానాన్ని దృష్టిలో ఉంచుకొని విమర్శించవలసినదిగా పాఠకులను కోరుతున్నాను (ఏ నవలనైనా సరే)

మీ

తాడిగిరి పోతరాజు.

### వ్యాసాలు

మీ 6–10–67 పత్రికలో ప్రచురించబడిన "ఘోష నుంచి సింహాళం" అనే కథలో "వాన్గ్మయం" అని "జ్ఞానం" అని వ్రాశారు శ్రీ ఎం గారు. వీటి అర్థం వివరించ ప్రార్థన ఎంత గ్రామ్యమయిన భాషాప్రయోగాన్నే వాడుస్తే ఎలా?

శ్రీ వశిష్ఠ గారు వ్రాసిన "ముగ్గురు మూర్ఖులు" వ్యంగ్య ప్రధానమై చాల బాగుంది. "వెన్నెల దీపం" మెచ్చుగా ఉంది "మీభర్తలవర్తనం చేసుకోండి" అని రచయిత్రి యువతులనుద్బోధించటం ఎంతైనా సమంజసంగా ఉంది

మీరు కథలు, కార్టూనులు, రాజకీయాలతో కూడిన ఆధునిక సాహిత్యంతో బాటు పురాతన కవుల జీవిత చరిత్రలు పద్యాలు నాటకాలతో కూడిన ఉత్తమ సాహిత్యాన్ని మాకు అందజేస్తారని ఆశిస్తున్నాను కథలు నాటకాలు, పద్యాలు, సినిమాలు రాజకీయాలు తదితర వ్యాసాలతో కూడి మీపత్రిక నూతన వధువై సర్వాంగ సుందరంగా వెలువడితే చూసి ఆనందిద్దామని అభిలషిస్తున్నాను.

వే. వ. శాస్త్రి (బెంగుళూరు) ●



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# బ్రూక్ బాండ్
# బాన్
## ఇన్‌స్టెంట్ కాఫీ

"ఎప్పుడూ అప్పటికప్పుడు వచ్చే మనోహరమైన సువాసనతో కూడినట్టిది!"

ఒకటిన్నుబాన్ తీసుకోండి. అందులో నిజమైన కాఫీ తృప్తి ఉంది. వేడి నీరు చేర్చిన వెంటనే బాన్‌లోని కమ్మని సువాసన వెదజల్లే అసలైన కాఫీ వెలువడుతుంది.

బాన్ ఎన్నికచేసిన మంచి కాఫీ గింజలతో తయారుకాబడి, దానిలోని కమ్మదనము, సువాసన, నాణ్యత, క్రొత్తదనము పోకుండా సీలువేసిన టిన్నులలో మీకు వస్తుంది. సువాసన, గుణము, నాణ్యము కలిగినట్టిది బాన్ ఇన్‌స్టెంట్ కాఫీ — ఈరోజే కొని చూడండి. దానికదేసాటి. ఏమంటే "ఎప్పుడూ అప్పటికప్పుడు వచ్చే మనోహరమైన సువాసనతో కూడినట్టిది."

దానిని తయారుచేయటం చాలా తేలిక! మీరు చేయాల్సిందల్లా ఒక టీ స్పూన్ బాన్‌కు వేడినీరు చేర్చటమే. వెంటనే ఆహ్లాదకరమైన కమ్మని వాసన వచ్చే అసలైన కాఫీ తయారవుతుంది! అది సేవించి చూడండి. ఎన్నికప్పులు కావాలన్నా తయారుచేసుకోవచ్చు — బాన్ అసలైన కాఫీ.




అద్భుతమైనది బాన్
ఇన్‌స్టెంట్ కాఫీ
(దానికోసం నేను వేచియున్నాను

(167C19-TEL)